వర్ణనములం దతిశయోక్తి చెల్లునంచు నిటాడితిరి. ఇంతియ కాక, 'యే యంగనలును మమ్ములం బోలం జాలరనుట కీయర్థపతి, ముద్దుకుమారుండే సాక్షి" యనియె. అంతనల్లన నగుచు, మునిపల్కె "నిర్భరంబగు ప్రేమ రాజిల్ల, నీచెల్వ యిట్లు వర్తిలుటం జేసి, యెట్లాడిన నీకుం జెల్లు గదమ్మ! అయిన నిట్లు రా వెల్లదినంబులును; సవతి 'యేగతిం గల్గునో మీందుం గంటివె!

క. నినుం బోలువనిత నీకును
వనజముఖీ! యితనిం బోలువాం డితనికి నెం
దును గల్గి కలంచునో! యి
ట్టినిగాఢపుముదముసొంపులీవులు చనునే?"

క. అనుటయు "నవ్వుల కనినన్
మునివర! మీ మాట యిట్లమోఘం బగునో!
వినలే నిట్టివి మానుండు
నను మన్ననచేసి" యనుచు నాతుక మ్రొక్కెన్.

అంత నమ్మహామునీంద్రునియాజ్ఞానుసారంబునం దద్విమానంబు కలభాషిణి విహరించుచున్న యెలందోటలోనికిం దిగియె, నట్టియెడ రంభానలకూబరులు వినయపూర్వకంబుగా నతనిచేత ననిపించుకొని, యప్పుడెదుటం గాన్పించు వాసుదేవుని ప్రాసాదరాజంబునకుం జెయ్యెత్తి మ్రొక్కి, తమవిమానంబుతోడ నిజేచ్ఛం జనిరి. కలభాషిణియు నటమున్న తన కనతి దూరంబున వినంబడువారల సల్లాపంబు లాలకించి యుండి, తదనంతరంబ ధగద్ధగితదిగంతరం బగుచుం జేర నేతెంచు విమానంబు నవలోకించియు నాశ్చర్యంబు నొందుచుండి యప్పు డట్లరుగు నలకూబరునిరూపలావణ్యాదిసౌభాగ్యంబునకు మిక్కిలి మెచ్చుచుం దదాలోకనంబునం దనియక, కొంతమేర తద్విమానంబు

క్రిందటిచాయం బొదరిండ్ల యీారమిమఱుంగున వారిసల్లా పంబు లాలకించుచుం జని, యంత నది మిక్కిలి దూరంబుగా నేఁగుటయుఁ దిరిగి వచ్చి కడుఁజేరువ నా యనుపమతేజుని నారదముని గాఁగ నెఱింగి, ప్రణమిల్లి లేచి, విరచితాంజలియై, సవినయంబుగా నడిగె "మౌనీంద్రచంద్ర! యిపుడు విమానముతో నేఁగినట్టి మహితాత్ములు రంభానలకూబరులె?" అందుకు నారదుఁ"డగు, నీ వెట్లెఱింగితి? మింట మేమాడుకొనిన పలుకులు వింటివో! వలవనిగర్వంబునఁ గన్నుగాన కాడెడి యనుచితవాక్యంబు లేరికైన నెట్లోర్వగవచ్చు? ఏ మింతవార మనుకొన నేరికిఁ జెల్లును? రంభకు సవతి యన నొకతెను భువిలోపల వెతకఁ బోవలయునె? ఓ ధవళాక్షి! దైవమనుకూలింప నా సవతివి నీవ కానేరవె? రంభ మొదలగు నే యచ్చరలకునైన నీదురూపసౌందర్యమహిమ లెక్కుడు గాక తక్కువె? అది యటుండ నీవు నలినాభుకొలువున గానవిద్యను మెప్పువడసి యున్నదానవు. పేరునఁ గలభాషిణివి గద! బిరుదుచదుర వగుదువు. అంబుజాక్షుకొలువు వేళాయెఁ, బోవలయు"నని, కలభాషిణికిం జెప్పి యచ్చోటు గదలి చనియె. కలభాషిణియు నంతఁ దనుఁ జేర వచ్చిన నెచ్చెలులుం దానును నిజగృహంబున కేఁగి, వేగంబ కొలువుసింగారంబు సంఘటించుకొని, కృష్ణుని నగరి కరిగె.

అంతఁ గొంతకాలంబునకుఁ గలభాషిణి తనచిత్తంబు నలకూబరచింతాయత్తం బగుచుండ దత్సమీపగమనంబున కుపాయంబు గానక బహుకాలంబు గడిపి. కాలయాపనంబు దుష్కరం బగుటయు. నొక్కనాఁడు దా నొక్కతియ వీణెఁగొని, గృహారామంబున కరిగియుండు నంత.

చ. లలితపుభూతిపూఁతయును లాతపుఁగోలయుఁ గక్షపాలయున్
మలకొనుచిన్న కెంజడలు మందులపొత్తము నాగబెత్తమున్
లలిఁ గనుపట్టుకిన్నెరయు లాహిరిమోదము సింగినాదముం
జెలు వలరంగ నొప్పు నొకసిద్ధుఁడు సింగపువారువంబుతోన్.

తే. అభ్రపదవి నేతెంచి యయ్యబల యున్న
తోఁటలోనికి డిగియె నద్భుతము గాఁగ;
నదియుఁ దన్మహిమకు వెఱఁగందుమనము
నల్ల నూల్కొల్పి యర్ఘ్యపాద్యాదు లొసఁగె.

తే. అతఁడు "నో కలభాషిణి! యాత్మగురునిఁ
గృష్ణుఁగొలువఁగ నేగుదే; గీతవిద్య
పూర్ణముగ నేర్చితే? రాకపోక లిపుడు
మానినాఁడు గదా దివ్యమౌనివరుఁడు.

క. దానంజేసియ నీకును మానస మితరప్రచింత మాని తిరముగా
నానలకూబరునంద యధీనంబై నిలిచి యున్నదియె? తరలాక్షీ!

చ. కడపటినాఁడు నిన్ను నిటు కాంచనగర్భతనూజుఁ డంపుచోఁ
గడమయభీష్టసిద్ధియును గాఁదగుదీవన యిచ్చెఁ; గావునం
బడఁతి! యమోఘ మాయనఘుపల్కు; చలింపఁగ నీకు తాల్మి, నీ
బడలుటఁ జూడనోపుదురె ప్రాణసఖుల్ క్షణమాత్రమేనియున్?

సీ. తడవులనుండియుఁ దపము సేయఁగఁ బూని
మణికంధరుఁడు పాట మాని యునికి,
నుపవాసఖేదంబు నపనయింపఁగలేక
వ్రేఁగుచున్నవి నాదువీను లిపుడు;
వీణె వాయింపు మోవెలఁది! నేఁడైన దు
ష్టిగ విని పారణ సేయుఁ గాని
యీ భువనముల మీయిరువుర
గానంబ కాని యన్యము లింపు గావు నాకు"

తే. అనిపలుక, మాటమాటకు నద్భుతంబు
చాలఁ బ్రబలంగ విని విని, యా లతాంగి
కరసరోజముల్ ముకిళించి, కరము వినయ
మతిశయిల్లగ నిట్లను నతనితోడ.

క. "ఓయనఘ! దేవుడవో యో
గాయత కపిలాదిసిద్ధులందు నొకఁడవో
నీయనుభావం బద్భుత
మై యున్నది, నాపు మెద్ది? యానతి యీవే!"

అని పలుక "జలరుహానన! నీ వెంచిన వారలలో నె వ్వాఁడను గాను. మణిస్తంభుండనుసిద్ధుండ"నని, యాతండను టయుఁ గలభాషిణి యిట్లనియె, "ఓ మహితాత్మ! మీ వచన మొక్కొకచే పరికించి చూచినంత నా మనంబున నబ్బు రంబు ఘనం బగుచున్నది. ఎంచి చూడ, మీ కిమ్మహినిఁ గాన రానియది యేమియును లేదు. స్త్రీస్వభావంబున మిమ్ముల నేనొకటి వేఁడిన, మన్నింప వలయు. గానవిద్యా పరిపూర్తియైన వెనుక, నారదశిష్యుండగు మణికంధరుం డేమేమి సేయుచుండె, కరుణించి యాన తీయవలయు."

దానికి మణిస్తంభుఁడు,"మణికంధరుండు వీడ్కొను నవస రంబున, నారదుండాతని కిట్లనియె. 'తొల్లి తుంబురునకు గాన విద్యాకౌశలంబున నోడి, నే నీనాఁడు కృష్ణుని వలనను, నతని దేవుల వలనను శిక్షితుండనై, యనుపమసంగీతకౌశలాఢ్యుండ నైతి.

క. ఏ నిన్నిపాట్లఁ బడి యీ
గానమహిమఁ గంటి నీవుఁ గలభాషిణియున్
మేను చెమర్పక యుండం
బూనితి రిది యప్రయాసమున హరికరుణన్.

అనుడు 'ఓ యనఘ! మిమ్ములఁగొలుచుపుణ్యంబున కిది యరుదయ్యె? తన్నందినవారు తనంత లన లోకోక్తి వినమె! అది యట్లుండె; నే కొదవయు లేక సదా నివాసముగ వైకుంఠంబుననుండి యాసదయుని విష్ణునిఁ గొల్వఁ గల్గెడు మహాభాగ్యంబు నాకెటులబ్బునో యానతీయవలయు'నని మణికంధరుండు వేఁడిన, నారదుం డతని కిట్లనియె. 'మణికంధర! నీ వత్యనఘుఁడవు. మేలు! మేలు! ఈ యనుపమబుద్ధి యేరికైనను గలదే! పుణ్యంబును, బాపంబును; విధియును, నిషేధంబును; మేలును, గీడును; బరలోకంబు ననువానిం గూర్చి విననివారు లేరు. గాని యాత్మహితం బెద్ది, యది తలఁపలేరు.

చ. అలయక వేదశాస్త్ర సతతాభ్యసన వ్యసన ప్రసంగతిం
దెలివి యొకింతఁ గాంచినగతిన్ మతికెక్కియు వెట్టిదీరె రోఁ
కలి దలఁ జుట్టుమన్న క్రియఁగా నొకకొందఱు దల్తు రప్పటిం
గలుషపథప్రవర్తనమె కర్మపువాసన నన్యుఁ గొల్వఁగన్.

గంధర్వనందన! వినుము. విద్వాంసులందు విదితార్థకృతిలోలహృదయులు ముఖ్యులు. వారిలోఁ గర్తలెంతయుఁ బూజ్యులు. కర్తలందు బ్రహ్మవిదు లెక్కుడు. ఆ మీఁదఁ బరమ మొకటి కలుగ దనుచు మున్ను మనువు పలికె. ఈ త్రోవలు కరంబు దూరముగఁ ద్రొక్కిన వాఁడవు. లక్ష్మీవరు నిత్యసన్నిధి విశేషమహత్త్వమెఱింగియా విభవంబు గాంచుటనాసయొనర్చితి. కావున నీ వడిగిన యద్దేవుని యనవరత సన్నిధి మహత్త్వవిశేషావాప్తికిఁ బెద్దలచే నే వినినయుపాయ మెఱిఁగించెద.

క. అధికారి కానివానికి నధికపదవిఁ దెలుపఁ బ్రాప్తమయ్యెడు పాపం
బధికారియైనవానికి నధికపదవిఁ దెలుపకున్న నగు నిక్కముగన్.

అని యిట్లని చెప్పె,

సీ. 'తనశక్తికొలఁది సత్కర్మము ల్ఫల వాంఛ
మాని కృష్ణార్పణమతిఁ జలుపుట
ప్రతిషిద్ధకర్మంబు పరిహరించుట విష్ణు
భక్తి పైఁ గ్రమమునఁ బాదుకొనుట
తద్భక్తిగలపుణ్యతములసంసర్గంబు
దుర్జను లున్నట్టి త్రోవఁ జనమి
విష్ణుసన్నిధికళావిఖ్యాత వివిధ ది
వ్యక్షేత్రతీర్థయాత్రాచరణము

గీ. బ్రహ్మచర్యంబుఁ దపము వైరాగ్యగుణము
వలయు వైకుంఠమును గోరువారి కెల్ల
వీనిలోపలఁ గొన్ని గావింపఁ గనిన
వృథఁ జనవు చేర్చుఁ గ్రమమున విష్ణుపదము.'

అని చెప్పి నీవు నిజశక్తికొలఁదిఁ నిందుఁ బ్రవర్తిల్లుము. కృష్ణానుగ్రహమునం గలిగిన యీ యనన్యసాధారణసంగీత చాతుర్యంబు వృథ సేయక శ్రీ పురుషోత్తమశ్రీరంగాదిదివ్య క్షేత్రములందు ముకుందసన్నిధిం దద్దివ్యగుణనామసంకీర్తన గానంబు గావింపు మది సకలశ్రేయోనిదానం బని పలికి తత్ప్రసంగవచనంబున.

ఉ. అక్కజమైన భక్తి దనరార నతండనయంబుఁ గృష్ణునిం
దక్కక యాత్మ జూచిఁ బ్రమదంబునఁబొంగుచుఁజెంగలించుచుం
జొక్కుచుమ్రొక్కుచుం బొగడుచుంబలికించుచుఁగన్నుమోడ్చుచు
న్మిక్కిలి చోద్యమందుచును మెచ్చుచుఁ బాడుచు నాట్యమాడుచున్.

క. కేవలము నతిప్రేమ ర
సావేశవశంవదాత్ముఁడై తద్గుణముల్

భావించుచు నొకరీతిం
ద్రోవఁ గనుచు నేఁగె నారదుండు నిజేచ్ఛన్.

మణికంధరుండును దచ్చరితంబులకు నతివిస్మయ ప్రమోద హృదయుండగుచు నితం డింతధన్యతామహిమంబున నొప్పునే యని కొనియాడుచుం దనదృష్టి మార్గంబు గడచు నందాఁక వీక్షించి యెట్టకేలకు నాలోకనంబులం ద్రిప్పుకొనియెను. ఇవ్విధంబున గురుం డరిగిన నతండుఁ దదుక్త ప్రకారంబునఁ బుణ్యకర్మంబులు నడపుచుఁ గ్రమంబున విష్ణుభక్తిహృదయంబునం బొదలఁ దీర్థయాత్రలు గావించి యనంతశయనంబునకుఁ బడమటిదిశ దళకళికాపుష్పఫలాదిశోభితంబగు వనవాటిని హరిని గూర్చి తప మొనర్ప దొరఁకొని యున్నవాఁడు. దానఁజేసి యోతోయజముఖి; యాసరసుని గానకళామాధురి యేమియు ననుభవింప నాకు దొరకదయ్యె."

ఇట్లు పలికి సిద్ధుండా దిక్కునకు విలోకనములు నిగుడించి "యదే నిగాఢపుఁబద్మాసమునఁ గూర్చున్నాఁ డ"నుటయు, నపుడు నికటావనిజంబున నున్న చిల్కయొక్కండు మనుష్యవాక్కున నిట్లనియె "నా నివాసంబు నందనవనంబు.వనజాక్షుఁ డిచటకు మును పారిజాతంబు దెచ్చుచో నందుండు పక్షు లిచ్చ గలిగి మఱలి పారుచునుండ, మద్భార్య యవ్వేళ బ్రసవార్తయై యున్కిఁ బఱవలేక, 'యెల్లైననగు. నే నిచటన యుండెద' నని యొక్కతొట్టిలో నడఁగియుండె. అది కారణమున నే నివ్వాటికిని, నాకమునకు రాకపోకలొనర్తు. నేడు నాకంబున మణికంధరుంగూర్చి నే వినినవార్తఁ దెల్పెద వినుండు. మణికంధరుం డిపుడు తపంబొనరించుచున్న వనం బద్భుతమహిమాన్వితం బందు

నిష్ఠాగరిష్ఠులై తపంబొనరించు వారలకు మాసాష్టకంబునఁ గార్య సిద్ధియగు. ఆకారణంబున మణికంధరుని తీవ్రతపంబునకింద్రుండు వెఱచి, యాతనికిఁ దపోభంగం బాచరింప రంభను బనిచి యున్న వాఁడ"నుటయు, కలభాషిణి యాచిల్కవచోవిలాస మున కత్యంతంబు రంజిల్లి మరిమరి వాని వినుతించె.

క. అంతట సిద్ధుం డా సీమంతిని నీక్షించి "యేను మదిరేక్షణ మీ
చెంతకువచ్చుట చెవులకువింతచెలువు గులుకుపాట వినుటకెసుమ్మా.

క. కావున విపంచిఁగైకొని నీవించుకగానపటిమ నెఱపగవలయున్
నావుడు "నటులకాక"ని యావిద్యంబ్రౌఢ్వుప్పెనతనికి మిగులన్.

గానావసానంబున నాచంచలాక్షి సిద్ధు నభివీక్షించి,

గీ. "అమరమతిపంపునను వచ్చినట్టిరంభ
కతన నే మయ్యెనో మణికంధరుని త
పం బిపుడు మీర లటు దృష్టి పఱపి చూడుఁ
డనిన నొకకొంతతడ వత డట్లు చేసి

క. నగుచు "నిఁక నేమి తపమో
మగువ! పలుపుచున్న వాఁడు మణికంధరుఁడా
మృగలోచనతో నదె యొక
చిగురుం బొందరింటిలోనఁ జిత్తజలీలన్.

అనిన విని కలభాషిణి యమ్మౌని స్తంభునిబోధమహి మకు వెఱఁగందుచు ననేకప్రకారంబులఁ బ్రశంసించి "యో మహాత్మా! యొకటిరెండుపూఁటలు మాయింట నిలిచి మేము సేయు పరిచర్యఁ గైకొనవలయు" ననిన నతండు "గానలోభంబున నీభవనంబునకు వచ్చి టింతియకాని, మఱి వీరువారునుంబలెఁ బట్టనంబుల నెట్టుకొని యిట్టునట్టు మహి

మలు పచరించునారము గాము, గూఢప్రకారంబున నిలుపనోపు దేని నీ యుపచారంబులు గైకొనియెద" ననుటయు "నట్లు చేయుదున"ని తన గృహారామంబునందు నిలిపి యతిరహస్యం బుగా నా సిద్ధునకు నిష్టంబులైన యన్నపానాదుల మోదం బొనర్చుచు నచ్చట నెవ్వరింబోనీక తాన పరిచర్యసేయుచు రెండుమూఁడుదినంబులు హృదయంబు రంజిల్లఁజేసి యంత నంతరంగంబున నలకూబరసంగమాభిలాషం బతిశయిల్ల నతని ప్రియవనితయైన రంభ తెఱంగెఱుంగుటకుఁ గ్రమంబున బ్రసంగము దిగిచి సిద్ధునితో "నోమహాత్మ! యిత్తరి నలకూ బరుండు తన వల్లభకు దవ్వై యెందున్నాడొకో? అతనిని బరి కించి చూడవలయు" ననుటయు సిద్ధుండు నవ్వుచు, "నీకదియే కదా ప్రధానప్రయోజనం బని" పలికి యిటునటు బరికించి చూచి, యతఁడున్నచోటు కని, కలభాషిణి కిట్లనియె,

ఉ. "తా వెనువెంట బాయక సదా చరియించినఁ దద్వినోద మో
దావృతిఁ జిక్కి రంభ తగినట్టి తపోహతి సల్పలేదు. కో
పావహ మింద్రుబుద్ధి కది యట్లగుటం బ్రియఁగూడి యట్టికా
ర్యావసరంబులందుఁ జనఁ డాతఁడు మానఁడు పెన్విరాళిచేన్.

క. కావున మణికంధరుని త
పోవనము సమీపభాగమున నొకవనిఁ జూ
తావళిలో నున్నాఁడదె
పూవులను జిగుళ్ళ నొప్పు భూజముక్రిందన్

గీ. తరుణి యిపు డాతనిపైఁ
బరాకుచే నీవు గానపాటవగుణముం
గరము మెఱయింపలే వే
నరిగెద మఱి లేదె యితరమగుపని యిచటన్.

క. అంపితేఁ బోయి వచ్చెద"ననుటయుఁ గల
భాషిణి "మహాత్మ నిన్ను నాపాలిభాగ్య
దేవతగ నమ్మియుంటి నాజీవితంబు
నేమిగాఁ జేసి పోయెద వెఱుఁగ జెపుమ."

అనుటయు "నేనిప్పుడు నీకై చేయవలయునది యెయ్యది నాకుం జెపుమా" యని సిద్ధుండడిగె. అందుకుఁ గలభాషిణి

క. ఈవేళన యాతనికడ కేవిధమునైనఁ జేర్చుటింతియ తక్కం
ద్రోవమఱిలేదునన్నుం గావన్ క్షణభంగురములు కాంతలతాల్మిల్

క. తదుపాయము దిద్దుటకున్
మది నెన్నఁ బ్రభావఘనులు మఱి లేరు మహా
భ్యుదయానుభావగుణసం
పదఁ బొదలిన మీరతక్కఁ బావనచరితా"!

అన విని సిద్ధుఁ డిట్లనియె

క. "మించుగ మాగురువులు శి
క్షించిన యా యెక్కిరింత సింగమునకు నూ
హించ నొక నాల్గుగడియల
సంచారము వలయు నతని సన్నిధిఁ జేరన్.

దీని కెంతవలసిననేమి యిదిదడవం బనిలేదు. నిన్ను దీనిపై నునిచికొని పోయెద నంటినేని యోపూఁబోడి! తోడిసిద్ధులిది వేఱొక్కలాగుగా నెంతు రెవ్వరి యంతస్సారం బెవ్వ రెఱుంగుదు రదియునుంగాక మీ బోంట్ల సంస్పర్శమాత్రంబునస్మదాదులకు సమ్మతింప నుచితంబుగాదు, మఱివేఱొండు సామర్థ్యంబు లేదు. నాకుఁగల దూరదృష్టిదూరశ్రవణశక్తి యిందేమియుఁ నుపకరింప దింక నీవుచెప్పినప్రకారంబుగావించెదఁ జెప్పు," మనుటయు నా సిద్ధునకుఁ గలభాషిణి యిట్లనియె.

సీ. "ఓ సిద్ధపురుష! మీ కేసరణిని గొని
చన్న నేమగుఁ దక్కు శంక గలదె?
నీమహత్త్వముఁ గాననిజదాత్మ లే మన్న
నేమి? కన్నమహాత్మ లించుకయును
వేఱొక్కగతిగ భావింపర, మముబోంట్ల
సంస్పర్శమాత్రంబు సమ్మతింప
నుచితంబు గా దంటి, రుచితంబె మఱి నాదు
ప్రాణహానికి నోర్చు టరసి చూడ?

గీ. బలుపలుకు లేల! యింక నా చెలులు గిలులు
నేఁగుదెంచి విఘ్నమొనర్తు రిత మెఱుఁగక
కావునం గొనిపొమ్ము శీఘ్రంబ నీదు
వెనుక నిడికొని నన్ను మద్విభుని కడకు."

అన నియ్యకొని, సిద్ధుండు దా సింగంబునెక్కి, "నన్నుఁ దాఁకకయ, దీనికటివిభాగంబునెక్కి వెనుకమరగొమ్ము నూతగాఁ గొనుచు రాఁగలవే" యనఁ గలభాషిణి "యీ పాటి మీయను గ్రహంబుగలిగియుండ నక్కట! యికనేఁ జనుదేరకుందునే?" యనుచు నవ్వాహనంబునెక్కె.

అప్పుడా యెక్కిరింతసింగం బాకాశమార్గంబువట్టి దవ్వు దవ్వు లరిగి, యొక్క పర్వతాగ్రంబున స్తంభితంబై, యెంత మొత్తినం గదలకున్న, సిద్ధుండు దానిఁ గొన్ని యడుగులుఁదిరుగఁబట్టి ధరణికి డిగఁదోలుకొని వచ్చి యచ్చట నచ్చెలువ తోడ నవరోహణంబు సేసి కేసరిని మేఁతకు విడిచి "యో పడఁతి! యో కలభాషిణి! యీముందఱి నికటంబునందు మృగేంద్ర వాహనయను శక్తి గలదు, తన్మందిరంబుముందఱ నున్న మృగేంద్రంబునకుఁ గ్రిందు మీఁదం జుట్టుపట్టున నెట్టి బెట్టిదంపు

సింగంబులుం జన వెఱచు నిది మఱచి యే నెంత తోలిన మన వాహనం బచటి కెట్లెదురు నడచు? మన మమ్మహాశక్తికి నభివంద నంబు చేసిపోయి గార్యసిద్ధియగు రమ్మనుచు నల్లన తనభల్లూక చర్మకోశంబుతోడి ఖడ్గంబు పుచ్చుకొని సింగంపుబల్లనముఁ బోక యక్కడనయొక్కమఱుంగున డాఁచి యాచపలలోచనను మృ గేంద్రవాహనగుడికిం దోడ్కొని చని తద్బాహ్యమంటపంబున నునిచి "యో కలభాషిణి! చింతిలఁ గావలదు. ఒకించుక సేపులోన నీ శోకమంతయు బుచ్చివైచెద. నాదు పల్కు సిద్ధము, ఇద్దేవి పూజకుఁ బువ్వులు దెచ్చెద"నని పూఁదోఁటకరిగె. అపుడు కడు ముదుసలి యొకతె, కలభాషిణిం జేరంజని యిట్లనియె. "కట కటా! యో లతాంగి! చిలుక, బావురుపిల్లినిఁ జేరినరీతి నీ దురాత్ముఁడగు సిద్ధు నెటనుండి చేరితివి?

ఉ. ఎంతయు వింతచెల్వమున నివ్వన మెల్ల నలంకరించుచుం
గాంతత నొప్పుమేనిపస గన్నులపండువు సేయునిన్ను న
ల్లంతన చూచి దైవ మకటా! దొరకించెనె యిట్టి నిర్దయ
స్వాంతునిచేతి కీ భువనసారము నంచుఁ గడుం గలంగితిన్.

క. ఆ కలుషాత్ముఁడు క్రమ్మఱి
రాకమునుపె తొలఁగిపోవ రాదా యెటకే
నోకూన; యీ మనోజ్ఞత
రాకృతి యేఁజూడ జాల నసిపా ల్గాఁగన్.

గీ. అమ్మ! వినుమింక నొకయించుకంత తడవు
నీ తెరువుఁజూడ నీ పేరు నీ తెఱంగు
నడిగి పరికింప మది యున్న దైనవాఁడు
రాకమును నీవు తొలఁగుట నాకుఁ బ్రియము

శా. నీ కెంతే నితఁడాప్తుఁడో జనకుఁడో నెయ్యంపుఁ దోఁబుట్టువో
నీ కార్యార్థమె పూని తానెచటికేనిం గొంచుఁబోచున్నవాఁ

డో? కాఁగా దిటువంటిప ల్కానక తోడ్తో నింత బెట్టాఁడ నే
నోకాంతామణి! వెఱ్ఱిగా నితని చెయ్వుల్మన్ను వీక్షింపుదున్.

అను పల్కులన్నియు విని కలభాషిణి తన మనంబున

క. "ఈయవ్వవాక్యములు దల
పోయఁగ నా యుల్లమునకుఁ బొందుపడిన య
ట్లై యున్నవి యీ సిద్ధుడు
మాయావియె యొక్కమాట మది నూహింపన్.

గీ. ఇంక నొక్కింతసేపున కెల్లవగపుఁ
బుచ్చివై చెద నని పల్కె నిచ్చటికిని
జేరునపు డది యీయమ చెప్పినట్ల
శక్తి కిడియెడు ననుట నిస్సంశయంబు.

సీ. ప్రజల కందఱకు నాపదలు వాపెడునట్టి
చక్రిపట్టణములో జనన మంది
వారకామిని నయ్యు గౌరవంబున సభ్య
జను లిటు చేరరమ్మనఁగ బ్రదికి
త్రైలోక్యగురుఁడు నారదమౌని ప్రియశిష్య
నిర్విశేషముగ మన్నింప నలరి
జగదీశురాణివాసపుసతుల్ శిక్ష గా
వింపంగ సంగీతవిద్య నేర్చి

గీ. తుద నొకానొక కపటసిద్ధుం డొనర్చు
శక్తిపూజకుఁ బశువై తిఁ జర్చసేయ
నెంతవారికిఁ దప్పింప నెట్లు వచ్చు
బ్రహ్మ దా మున్ను వ్రాసిన వ్రాఁతఫలము.

క. అని మది నడలుచుఁ బ్రియసఖు
లను మొఱఁగుటదలఁచి కడుఁగలంగుచుఁ దెగునే

యనుభావ్య మెంత యంతయు
ననుభవమునఁగాక" యనుచు ననయముఁగుందెన్.

తదనంతరంబ డెందంబు డిందుపఱచుకొని ధైర్యబలంబునఁ గంఠగద్గదిక వారించుచు నా వృద్ధభామినితో నిట్లనియె.

శా. "అమ్మా నీ పలుకెల్ల నెంతయు నిజంబై యిప్డు గాన్పించెనే
నిమ్మాయావిప్రకార మిట్లగుట యూహింపంగ లే కొక్కయ
ర్థమ్మున్ వీని కృపం గడింతునని యత్యంతాశ ప్రేరేఁపఁగా
నిమ్మాడ్కిం దెగి వచ్చితిం దెరువులే దీపాటు దప్పింపఁగాన్.

క. ఎక్కడికిఁ బాఱిపోయెదఁ
జిక్కపడక యేను వీని శీఘ్రగతికి నో
యక్క యిఁక దూరదృష్టియు
నెక్కడు వీనికిని గాంచు నెచ్చట నున్నన్."



# విద్యార్థులు: ప్రశ్నలు*

## బి. ఏ (1912)

ఈక్రింది పద్యముల యర్థమును మీ మాటలతోఁ బొందికగా వ్రాయునది.

(1) అర్పించు నప్పు డయ్యంగన కెంగేలి
జిగిసొంపు చిత్తంబుం దిగిచి కొనగ
నరసి కన్గొను నప్పు డయ్యింతి కనుఁగవ
పొలపము రాగంబు పొదలఁ జేయ
నన్యులఁ బనిఁబంచు నప్పు డమ్ముద్దియ
పలుకుల తీపు గోర్కులం గెరల్ప
నల్లన యాడెడు నప్పు డక్కొమ్మ వా
తెఱతావి ధైర్యంబుఁ ద్రిప్పిఁకొలుప
మరుఁడు తోడ్తోడఁ దేఁకుపమాలి కదిసి
తూపుగముల క్రొవ్వాఁడిమి సూప నంత
కంతకును నగ్గలంబగు వంతఁ దూలి
పోయెఁ బావకుఁడేమి సెప్పుదు నరేంద్ర.

కుటిలంపుఁ దలపునఁ గొడుకుల రావించి
కద్రువ యిట్లనుఁ గన్ను నీరు

---

* మద్రాసువిశ్వవిద్యాలయమున పరీక్షకులుగా వుంటూ అప్పారావుగారు యిచ్చిన ప్రశ్నా పత్రములలోని ప్రశ్నలను మచ్చుకు కొన్ని యిక్కడ పొందుపరుస్తున్నాను.

తొరగంగ వారలతో నబ్ధి పొంతకు
వినతయు నేనును వేడ్కనరిగి
యచ్చతెల్పునఁ గడు నభిరామ మగు నొక్క
యశ్వంబుఁ గాంచితిమవ్వధూటి
కేవల ధవళంబు నావిని యొద్దార
మునకు నేనదె నల్లఁదనముఁ గంటె
వెనుకదెస నన్న వోదయోఁ గనలి పన్ని
దంబు నఱచితి మోడిన దాస్యవృత్తి
వచ్చు సవతికి నే నెట్లు వరవుడంబు
సేయఁదగుఁ దోక నల్లగాఁజేయరన్న.

(ఎ) పై మొదటిపద్యము తృతీయపాదమున 'పనిపంప్పు డని' 'పనివంచు నప్పుడ'నియుఁ బాఠాంతరములు గనబడు చున్నవి. ఈపాఠభేదములను జర్చించి సిద్ధాంతీకరింపుడు.

(బి) తస్యా మనోహరం రూపం దృష్ట్వా దేవో హుతాశనః
మన్మథేన సమాదిష్టః పత్నీత్వే య తతే మిథః॥

(ఆమె సొగసైన రూపమును జూచి యగ్నిదేవుడు, మన్మథునకు లోబడినవాఁడై యామెను బత్నినిగా గ్రహించు టకు రహస్యమున యత్నించెను.)

ఈ సంస్కృతశ్లోకము పై మొదటిపద్యమునకు మూలము. తఱచుగాఁ దెనుఁగుకావ్యములయందుఁ గన్పట్టు కవితాధర్మ ములు కొన్ని తిక్కన యాంధ్రీకరణమునను నున్నవి. ఆ ధర్మ మును పై మొదటి తెనుఁగుపద్యమునందు సమన్వయించి చూపు నది.

(సి) పై రెండు సీసపద్యములకును గల రచనాభేద మును జూపునది.

(2) అక్కలలను నన్నయకుఁ దరువాతి కవులేల తలఁచు వాడరై రి?మధ్యాక్కఱయందు నన్నయ విరామ మెద్ది నుంచెను?

(3) హేమచంద్రుఁడు మహాకావ్యలక్షణములలో నొక టిగా "సుశ్లిష్ట ముఖ ప్రతిముఖ గర్భ నిర్వహణసంధి సుందరమ్" (A well-knit plot with begining, promotion, hope of success, removal of obstacles and completion) అని చెప్పియున్నాడు. వస్త్వైక కంఠ్యము (Uniy of plot) మనుచరిత్రమునం దెంతవఱకుఁ గలదో చర్చించనది.

(2) "ఔరా గంధర్వుఁడనగు నేను మున్నివరూథినిం గామించి యెన్ని విధంబుల వేడికొనిన నియ్యకొనదయ్యె."

ఈ వాక్యమునందు సూచితమైన కథతో నాటకము నారంభించి, యేకథ పట్టుతోఁ బరిసమాప్తి చేసిన నాటకము నకుఁ గొంత తగినవస్తు (A Dramatic plot) వేర్పడును ?

(3) ఈక్రింది వానిని నాటకరచనలో లోపములనుగా నెన్నుదురు. (a) సామాజికులకుఁ గథాంశములను దెలుపుటయే ప్రయోజనము గాఁగల సంభాషణము. (b) పాత్రస్వభావోన్మీ లనమునకుఁగాని (Development of character) కథానిర్వహ ణమునకుఁగాని (Development of plot) రసపోషణమునకుఁ గాని (Atmosphere)యావశ్యకముగాని యవాంతరవస్తుపాత్ర వర్ణనాదులు(Incidents, characters,description.)

మనుసంభవమున నిట్టివేవేనిఁ గలవా?

(4) "వనిత తనంతఁ దా వలచి వచ్చినఁ జుల్కనగాదె యేరికిన్. (బి)"ఒక్కొకవేళఁ బద్రముఖు లొల్లమి సేయుదురు"

ఇత్యాదిపద్యము. వీనికి పెద్దన కల్పించిన సందర్భమునకును మీ నాటకమందుఁ గల్పించిన సందర్భమునకునుఁ గల తార తమ్య మెద్ది ?

(5) వసుచరిత్రములో నే కథపట్టును (Situation) మను చరిత్రములో నేకథపట్టును మీరు మిక్కిలి రసవంతములని యూహించెదరు? సహేతుకముగాఁ దెల్పునది.

2. స్వరోచి, ఉపరిచరవసువను నామములెట్లు కలిగెను?

(3) మనుసంభవమునందు దేశకాలవిరుద్ధములైన వర్ణనాదులు కలవా? (4) పెద్దన పశుపక్ష్యాదుల స్వభావచేష్టితములు పరీక్షించిన వాఁడగుటకును, మాటలతో రూపరచన (Potraiture) చేయుటయందు సమర్థుఁడనుటకును దృష్టాంతముల నిచ్చునది.

(4) "సాధారణ యన గణిక కళా ధౌ
రేయాత్మ కపట లంపట లీలా
మాధుర్యవిధాయిని దురగాథ
మనోవృత్తి దానిగతిఁ దెలియంగన్"

ఏ మెఱుఁగుల(touches) చే వరూధిని సాధార సామాన్య కంటె (Ordinary heroine who is any body's) అతిరిక్తగాఁ జిత్రింపఁబడినది?

(2) భారతకథలందు ధర్మశాస్త్రవిరుద్ధములైన యాచరణములు కానవచ్చుటకుఁ గారణము లేమై యుండును?

(5) తెనుఁగుకవిత్వమునకుఁ దిక్కనసోమయాజికాలము నుండి రామరాజభూషణుని కాలమువఱకుఁ గలుగుచు వచ్చిన మార్పుల నడిమిత్రోవను శ్రీనాథుఁడుండెనని చూపునది.

2. "సాధ్యమైనపట్ల నెల్లనిట్లు దేవునకేని గొప్పవారికేని యీ భుజంగత్వముఁ గల్పించుట యీకవి (శ్రీనాథుని)యొక్క-గొప్పలోపము" ఇయ్యది యీకవి లోపమా లేక యీకాలపుఁ గవుల పరిపాటియా?

(6) అర్థానుస్వారముసంజ్ఞగాఁగల ధ్వనులిపుడు గ్రాంథిక భాషలో నున్నవా? ఖండబిందు సంజ్ఞవలన ప్రయోజనము లెవ్వి? ఈ సంజ్ఞ ప్రాచీన శాసనములయందుఁ గానరామికి కారణమేమై యుండును? 2 తెనుఁగుశబ్దము తద్భవమా? (3) తెనుఁగుగ్రాంథికభాష యెటులుగల్పితమైయుండవచ్చును?

* * *

బి. ఏ, 1915 సెకండుపేపరు. తెలుగుభాషాచరిత్రము, సాహిత్యము.

(i) Estimate the value of Nannichoda's Kumara Sambhavamu in a history of Telugu language and Literature. Account for the oblivion into which the poem passed until it was printed. (ii) To what extent did historical conditions influence the history of Telugu Literature ?

(iv) Mention some non - literary grammatical forms which were current in polite speech in the time of Tikkana Somayaji. (b) Discuss the conditions which determined the affiliation of non-literary spoken forms into the poetic dialect before the days of English influence (c) Did Rao Bahadur Viresalingam Pantulu garu reform the poetic dialect ? If so, was the reform based on any general principles ?

(v) From what sources did polite spoken Telugu derive its Tadbhava words? (b) In what department

of life did the language of the Mussalman conquerors of the Deccan influence Telugu ? Describe the process by which English words have displaced or are displacing Telugu and Mussalman words.

* * *

## ఎం. ఏ 1912 పాఠ్యగ్రంథాలు

(1) న చాతి రసతో వస్తుదూరం విచ్ఛిన్నతాం నమేత్, రసం వా న తిరోదధ్యాద్వస్త్వలంకారలక్షణైః- Sahityasarasangraha. (The action should not be long interrupted by the elaboration of Rasa. Nor should the Rasa be thrown into the back ground by over crowding action and embellishments.)

(ఎ) ఈ లక్షణము మల్లికామారుతమున నెంతవఱకు పట్టినది?

(బి) వసుచరిత్ర యయాతి చరిత్రలయందు నాటకలక్షణము లేమయిన నున్న యెడలఁ దెలుపుడు.

(2) సంస్కృతనాటకములందుఁ బ్రాకృతములవలెఁ దెనుఁగు నాటకములందుఁ దెనుగు వ్యావహారిక భాషాభేదములఁ బ్రయోగింపఁ గూడునో కూడదో చర్చింపుడు.

(ఎ) సంస్కృతనాటకములఁ దెనిగించుటలోఁ దత్సమప్రయోగమే నిర్ణయములనైన ననుసరించినదా? ఎట్టి నియమము లావశ్యకములు?

(బి) సంస్కృతప్రాకృతవైయాకరణులును నాలంకారికులును గ్రామ్యశబ్దము నెట్లు సిద్ధాంతము సేసిరి? ప్రాచీనాంధ్ర లాక్షణికుల నిర్వచన మెట్లు? దీనికిని దానికిని గల వాటి దెల్పినది.

(3) హేమచంద్రుడు తన కావ్యానుశాసనములో మహాకవులు సుకుమారులను బురుషార్థములందుఁ బ్రవర్తింపఁజేయుటకుఁ గావ్యముల రచింతురనియు కవిశక్తిఖ్యాపనమాత్రములగు యమకాదిశబ్దచిత్రములు కావ్య వైరస్య హేతువులై పురుషార్థోపదేశమున కుపయోగముకావనియు, సరిత్పర్వతాది వర్ణనములు వస్తువృత్తిచే రసభంగహేతువులనియు వ్రాసెను. ఈ యభిప్రాయమునననుసరించి సామాన్యముగా నాంధ్ర ప్రబంధములయొక్కయు విశేషముగా వసుచరిత్రము యొక్కయు విలువనెన్నుఁనది. (ఎ) ప్రబంధములలో సరి దద్రికాననాదుల వర్ణనమెంతవఱ కుచితముగ నుండును? (బి) తఱచుగాఁ బ్రబంధములలో నే యే పట్టుల నే రసమునకుఁ బోషకముగా వసంత ఋతువు వర్ణింపబడినది? (సి) విష్ణుచిత్తీయమునందలి వసంతర్తు వర్ణనములో స్వభావానుసారముగా నున్నట్టియుఁ బ్రతిమాకల్పనోపయోగముగా నున్నట్టియు (Which help to form a mental picture) భాగములనెత్తి తేటమాటలతో వ్రాయునది.

(4) తల్లికోటయుద్ధమున విజయనగరరాజ్యమునకుఁ గలిగిన విప్లవము వసుచరిత్రమునందు స్మరింపఁబడెనా?

(5) (a) పిలిచి పొన్నికంటి తెలగన్న నీచేయు
నచ్చతెనుఁగుఁ గబ్బ మన్ని యెడల
మించి వెలయు.

(b) అరబి పారసి గుజరాతి యూరె మచ్చ
తెనుఁగు కన్నోజి మొదలుగాఁ దెలిసి వ్రాయ
దారి గన్నట్టివాడు.

మొదటి వాక్యఖండములో నచ్చ తెనుఁగను మాట కర్థమేమి ? ఆ యర్థము సరియా ? రెండవ వాక్యఖండములో

నచ్చుయను మాటను గవియే యర్థమునను బ్రయోగించియుం డును? అప్పకవి చెప్పిన తెలుగుఁ మఱుఁగులు, ప్రాఁదెనుఁగులు నెట్టివి. (c) అచ్చ తెనుఁగునకును దేశ్యమునకును గలభేదము కేతన యేరీతిని జెప్పినాడు; సంస్కృత ప్రాకృత లాక్షణికులు దేశ్యశబ్దమున కిచ్చిన యర్థములకును గేతన యిచ్చిన యర్థము నకు సంబంధము కలదా?

(D) క॥ తెనుఁగునను మాఱుపేర్లి డి
పెనఁచిన వినఁగూడదనుచు బిరుదులుఁ బేళ్ళన్
మును వేల్పు బాసలెం బడి
మనిచెదఁగాదనకుఁ డయ్య యుల్లము లందున్.

ఏ వాక్యదోషములు కలుగునను భీతిచేత తెలగన తన ప్రతిజ్ఞనీ మట్టుకు సడలించెను. తెనుఁగు భాషలో విపులముగాఁ జేరియున్న సంస్కృతపదములను వర్జించి తెలగన యా దోషము లనుఁ దప్పించుకొనగలిగెనా?



# సాహిత్య లేఖలు* : నాటక గోష్ఠి

ఫోర్టు విజయనగరం
11 మార్చి 1909

ప్రియమైన సుబ్రహ్మణ్యం +

నువ్వు పరీక్ష ప్యాసయావని నేనెంతో ఆనందించాను. మదరాసులో వుండగా నీకు జబ్బుచేసిందా నాఆందోళన అంతా యింతాకాదు. పరీక్షల నాటికి నిమ్మళిస్తుందో నిమ్మళించదో నని

---

* ఇవి శ్రీ వంగోలు ముని సుబ్రహ్మణ్యము గారికి మహాకవి వ్రాసిన లేఖలు. మహాకవిని సంస్మరిస్తూ శ్రీ సుబ్రహ్మణ్యముగారు 1936 ఫిబ్రవరి 27 వ తేదీన హిందూ దినపత్రికలో వ్రాసిన వ్యాసం, జిజ్ఞాసా పరులు చదువతగ్గది. "మనకు పోస్టుద్వారా, పాఠాలనుచెప్పే సంస్థలు కొన్ని వున్నవి. అలాగ పాఠాలను నేర్చుకున్నవారిలో నేనొకడిని. విజయనగరం, మద్రాసు, ఉదకమండలముల నుంచి అప్పారావు పంతులు గారు, తమ లేఖల ద్వారా, అనేకవిషయాలను నాకు బోధపరుస్తూ వుండేవారు."

+ శ్రీ వంగోలు ముని సుబ్రహ్మణ్యంగారు: 1886 అక్టోబరు 2 వ తేదీన నెల్లూరుజిల్లా నాయుడుపేటలో జననం. 1903 లో వంగోలులో మెట్రిక్యులేషన్ ప్యాసయి ఉన్నత విద్యాభ్యాసంకోసం 1904 లో విజయ నగరం వెళ్లి 1908 వరకు అక్కడ చదివి పట్టభద్రులయారు. వారికి 1906 లో మహాకవితో పరిచయభాగ్యం లభించింది. 1909 జనవరి నుంచి ఆరునెలలవరకు వారి స్వస్థలమైన నెల్లూరులో ఉపాధ్యాయులుగావుండి

భయపడిపోయాను. మరి పరీక్షలంటే లేనిపోని బెడద. చికాకు. ప్రాణాంతకం. ఇవి ఎంత బాధాకరమైనవంటే పరీక్షలు ప్యాస యామని చెవిని పడీపడగానే తమ నెత్తికెత్తిన బరువు దింపుకు న్నట్లు యువకులు 'ఫీ'లవుతారు. వాళ్ళప్రాణాలు తెరిపిన పడ తాయి. పరీక్షలంటే నాకు పరమఅసహ్యం.

నామీద * గౌరవంకొద్దీ నువ్వలాగ నీ ఉత్తరంలో వ్రాశావు. నీ అభిమానానికి నా ధన్యవాదాలు. నాతో కలిసి

---

అనంతరం మూడేళ్ళకాలం కాకినాడ కళాశాలలో ఇంగ్లీషుట్యూటరుగా పనిచేశారు. 1912 నుంచి న్యాయవాదులుగా వంగోలులోవుంటున్నారు. సంస్కృత ఆంధ్ర ఆంగ్లభాషలలో మంచి పరిచయమున్న యువకునిగా ఆరోజులలోనే వీరిని పండితులు మెచ్చుకునేవారు.

"ఆ రోజులలో బి. ఏ. పరీక్షకు మద్రాసు పోవలసివుండెను. నేను మద్రాసు వెళ్ళియుండి విశేషజబ్బునపడి మహారాణిసర్కారు అడ్మిరాలిటి హౌస్‌లో వున్నారని తెలిసి, పోస్టుకార్డు వ్రాయగా వెంటనే నన్ను అక్కడికివచ్చి కనపడమని పంతులుగారు నాకు ప్రత్యుత్తరము వ్రాసిరి. నేను అడ్మిరాలిటి హౌసుకు వెళ్లి రెండుదినములక్కడ పంతులుగారితో నుంటిని. నాకు కావలసిన వైద్యము చేయించి ఆయన నన్ను మోటారుకారులో తీసుకొనివచ్చి నేనుండు స్టూడెంట్సుహోములో వదలిరి. అడ్మిరాలిటి హౌసులోనుంచి బయలువెడలునపుడు ఆయన తన సందుకపెట్టెతీసి అందుండిన పైకమంతయు నాకిచ్చిరి. అదినేను లెక్క బెట్టగా యనభై రూపాయలుండెను. ఇట్లు పంతులవారి ఔదార్యమువల్లను నాయందలి అఖండ ప్రేమాతిశయమువల్లను నేను బి. ఏ; పరీక్ష ప్యాసు అయితిని." - శ్రీ సుబ్రహ్మణ్యంగారు వ్రాసిన తెలుగువ్యాసములోని కొన్ని పంక్తులు.

* నేను పంతులువారివద్ద జేరిన వారముదినములకే వారికి నాయందు విశేషప్రేమ గలిగిన సూచనలు నాకగుపడినవి. నాకును వారి యందు భక్తివిశ్వాసములు బాగుగ అంకురించినవి. కొలదికాలమునకే

మెలసి మసలడంవల్ల నా సాంగత్యఫలితంగా నీకు సారస్వతాభిరుచీ అభినివేశమూ ఉత్సాహమూ కలిగాయని నువ్వు చెబుతున్నావు. సరే సంతోషం. అయితే వొక్కమాట. నీతోపరిచయం, కలగడంవలన రానున్నతరంలో యువకులు మాకన్న ఎక్కువ సాహిత్యకృషి చేయగలరన్న విశ్వాసం నాకు కుదిరింది. యువకులపట్ల ఆప్యాయమూ అభిమానమూ కలిగాయి. నీ పరిచయంవల్ల మళ్ళీ నా స్వయంవ్యక్తిత్వాన్ని నేను పొంద

---

నేను వారిపిల్లలతో సమానుడనై తిని. వారును వారింటికివచ్చు వారందరును నట్లే నన్ను పరిగణించియుండిరి. గుర్రపుబండిమీద వారెక్కడికైన వెళ్ళునపుడు నేనుగూడ బోవుచుంటిని."

• శ్రీ సుబ్రహ్మణ్యంగారికి మహాకవితో కలిగిన పరిచయం వారి వాక్యాలలోనే: "1906 వ సంవత్సరములో ప్రయివేటుగా ఎఫ్. ఏ చదువుచు మాతండ్రిగారి బలవంతముమీద నేను విజయనగరంసంస్థానము ఆఫీసులో నెలకు పది రూపాయిలు జీతంమీద గుమాస్తాగా నుంటిని; అట్టిసమయములో మాతండ్రిగారు వకనాడు నన్ను శ్రీ అప్పారావు పంతులవారివద్దకు దీసికొనిపోయి నాసంగతి వారితో ముచ్చటించగా వారు నన్ను సంస్థానం ఆఫీసుకు పోవుట మానివేసి ప్రతిదినం ఉదయం ఏడుగంటలనుండి పదిగంటలవరకు తమ ఇంటివద్దనుండి వారుజెప్పిన పని జేయుచుండుమని నాకు జెప్పిరి. పదిరూపాయలకు గుమాస్తాగా నుండుట చాల అవమానకరమని యెంచిన నాకు పంతులవారి ఇంట పని చేయుట విశేషసంతోషదాయకమయ్యెను. ఆ మరునాటినుండియు నేను ఉదయం ఏడుగంటలకు అప్పారావుపంతులవారి ఇంట హాజరగుచుంటిని. వారివద్ద తెలుగుసంస్కృత గ్రంథములను మనదేశమందలి శిలాశాసనముల రికార్డులుగల ఎపిగ్రాఫికా ఇండికా ఇండియన్ యాంటిక్వేరీ నెల్లూరుజిల్లా శాసనములు మున్నగునవిన్నీ మూడునాలుగు బీరువాల గ్రంథములున్నూ వుండెడివి. విజయనగర సంస్థానమునకు చెందిన శాసనములును, విజయనగరరాజుల బంధువుల వంశవివరములను తెలుపు

గలిగాను. నా వొంట్లో కులాసాగా వుందని ఆరోగ్యం చక్కగా వుందని దర్బారురాజకీయాలను దూర దూరంగా వుంచగలుగు తున్నానని తెలిస్తే నువ్వు ఆనందిస్తావుకదూ!

కన్యాశుల్కంనాటకాన్ని చాలామటుకు మార్చివేశాను. మూడు అంకాలు ప్రెస్సుకు వెళ్ళినతరవాత నాటకంలోని వొకపాత్రపట్ల నాకుగల దృక్పథాన్ని మార్చుకోవలసి వచ్చింది. నువ్వు మళ్ళీ మదరాసు వెళ్ళినపుడు శ్రీ జి. రామస్వామిచెట్టిని కలుసుకుని నా నాటకం త్వరగా అచ్చు అయేటట్టు చూడమని చెప్పు. ఇప్పటికే అనుకోనంత ఆలస్యమయింది. మా మేనల్లుడు

---

కొన్ని పద్యకావ్యములు వచనగ్రంథములుగూడ నుండెడివి. ఈగ్రంథము లన్నియు నేనుజదివి అందలి వంశములు వివరముగవ్రాసి అందలి పద్య ములను ఇంగ్లీషుతర్జుమా జేయుటయు అవన్నియు అచ్చొత్తించుటయు నాపనిగ నిర్ణయింపబడెను. ఇదిగాక ఆంధ్రకవులు వ్రాసిన ప్రబంధకావ్య ములలోని ప్రథమాశ్వాసములలో కృతిపతియొక్కయు కృతికర్త యొక్కయు వంశావళులు దెలుపు పద్యములు దీసి అందుండు చారిత్రక విషయముల విడదీసి శిలాశాసనములలోని రాజుల మంత్రుల జీవితకాల ముల ఆధారమువల్ల ఆంధ్రకవుల, వారిపోషకుల కాలనిర్ణయము జేయ వలసియుండెను. అప్పారావుపంతులుగారు నాకు మార్గముజూపి పనులు ప్రారంభింపజేసి వదలివేసినంతనే నేనీపనులన్నియు కడుత్వరితముగ పూర్తిచేయుచుంటిని. ఆయన నియమించిన పనులు రేయింబవళ్లు జేయు టకు నాకు యుత్సాహముగ నుండెను. ఈ విధముగ మేముజేసిన కాల నిర్ణయమునకును అప్పటికిముందే శ్రీ కందుకూరి వీరేశలింగంపంతులు గారు వ్రాసియుండు కవులచరిత్రలోని కాలనిర్ణయమునకును గొంత భేద భావము లుండెను. ఆయనకు ఆంధ్రకవులచరిత్రనువ్రాసి ప్రచురించవలె నని ఆశయమైయుండెను."

శ్రీ పోతరాజు నరసింహం లేడూ, కాస్త శ్రద్ధతీసుకోమని అత
నికి ఉత్తరం వ్రాశాను. కాని అతను జవాబు వ్రాయలేదు.

తెలుగువ్యాకరణం వ్రాయడానికి ఉపక్రమించాను.
నెల్లూరు జిల్లా వ్యావహారిక భాషావ్యాకరణం నాకు అవసరం.
నెల్లూరుజిల్లా వాడుక భాషాపదాలు, ముఖ్యంగా క్రియలు,
క్రియాభేదాలు విశేష్యములలోని రూపభేదాలు తెలిపే ఒక
పట్టికను తయారుచేసి నాకు పంపించగలవూ?

మహాభారతంలోనివ్యాకరణవిరుద్ధప్రయోగాలనుగురించి
తిక్కనసోమయాజిని గురించి అచ్చయిన * 'అముద్రితగ్రంథ
చింతామణి' సంచిక కాపీలు, నీకు దొరికినట్లయితే వాటినిపంపు.
కీ. శే పూండ్ల రామకృష్ణయ్యగారు నాకు స్నేహితులు. తిక్కన
వంశీకులను గురించి, కొట్టరువుగ్రామం మొదలైనవాటిని
గురించి ఆయన వ్రాశారు.

ఈసారి ఉత్తరంలో విపులంగా అన్నీ వ్రాస్తాను.

ప్రేమాభిమానాలతో.

---

* 1885 వ సంవత్సరమున సుప్రసిద్ధపండితులు శ్రీ పూండ్ల రామ
కృష్ణయ్యగారి సంపాదకత్వాన నెల్లూరులో ప్రారంభమయిన సాహిత్య
మాసపత్రిక. శ్రీ ఒడయరు వీరనాగయ్యగారు మొదట శ్రీరామకృష్ణయ్య
గారితో సహకరిస్తూ తామూ సంపాదకులుగా వుండిరి కాని తరవాత వారు
విరమించారు. ఛందోవ్యాకరణాలంకారశాస్త్రవిచారణ, సమస్యాపూరణము,
వసుచరిత్ర మనుచరిత్రాది ప్రాచీనకావ్యాలలోని కఠినపద్యాలకు అర్థ
నిర్ణయం, భిన్నప్రతులలోవుండే పాఠాంతరములను పరిశీలించి కవి
హృదయనిర్ధారణం, పూర్వపైయ్యాకరణులమతాన్ని అనుసరించి
లక్షణవిరుద్ధమైన శబ్దసమాసాలకు ఆక్షేపణ, పూర్వపక్షసిద్ధాంతములు,
నాడు వెలువడే కావ్యాలపై విమర్శనము, కవినిర్ణయములు ఇత్యాది

ఎక్కహిల్ హౌస్
ఉదకమండలం *
7 మే 1909

ప్రియమైన ముని సుబ్రహ్మణ్యాం,

నీభోగట్టాలేవీ నాకు తెలియడంలేదు. ఇన్నాళ్లూ ఎక్కడవున్నట్టు, నువ్వు ఏంచేస్తున్నట్టు? తరుచు నేను నీకు ఉత్తరాలు రాయడంలేదంటే కారణం నాకు రాయాలని లేక కాదు; బొత్తిగా వోపికలేక.

'కన్యాశుల్కం' యిప్పటికి నూటయాభై రెండు పేజీలు అచ్చయింది, చిన్నక్షరాలలో ముద్రించినా రెండువందల పేజీలు

---

విషయాలపై వ్యాసాలను అచ్చువేయిస్తూ శ్రీ రామకృష్ణయ్యగారు ఈ పత్రికద్వారా యెన్నదగిన సాహిత్యసేవచేశారు. అముద్రిత ప్రాచీన గ్రంథాలను సేకరించి వాటిని యితరప్రతులతో తైపారువేసి దోషాలను సరిదిద్ది పరిష్కరించి అచ్చువేయడం 'అముద్రితగ్రంథచింతామణి' ఆశయం. పండితకవులు శ్రీ మండపాక పార్వతీశ్వరశాస్త్రి, వేదం వేంకటరాయశాస్త్రి ప్రభృతులు ఈ పత్రికలో తమ రచనలను ప్రకటిస్తూ వుండేవారు.

* స్వత్ససిద్ధముగా మహాకవి అర్భకులు. శీతోష్ణపరిస్థితులప్రభావానికి ఆయన శరీరం ప్రతిచలిస్తూ వుండేది. సాధారణంగా వీచే గాలిసైతం ఆయనకు పడేదికాదు. గాలి వొంటికి తగలకుండా గొడుగును అడ్డంపెట్టుకుంటూ వుండేవారు. వొంట్లోని సత్తువ కూడబెట్టుకోవడంకోసం వేసవి కాలాల్లో విజయనగరం రాజకుటుంబీకులతో ఉదకమండలం వెళ్లేవారు. కొండుభట్టీయము మొదలైనవి ఆయన ఉదకమండలంలో వున్నప్పుడు వ్రాశారు.

దాచేటట్టు వుంది. బిడియమనేది అడ్డువస్తున్నమాట నిజమే అయినా కన్యాశుల్కం గొప్పరచనగా రూపొందించానని నేను అనుకుంటున్నాను. నాటకం చదివి నాకునేనే ముగ్ధుణ్ణయాను. అదే దీనికున్న గీటురాయి. మొదటికూర్పుకంటె రెండవకూర్పు నామనోభావాలను ఆలోచనలనుసమగ్రంగా వ్యక్తం చేస్తున్నది. తొలికూర్పు అలాగకాక, పై మెరుగులనే ప్రతిబింబించింది.

ఇంతవరకూ అచ్చయిన ఫారాలను నీకు పంపమని నా నాటకముద్రాపకులకు రాశాను. దయవుంచి జాగ్రత్తగా వాటిని చదువు, నీ స్నేహితులకు చదివి వినిపించు. నాటకంలో వొక దానికొకటి అతకని విషయాలు అసంగతాలు ఏవైనావున్నట్లు నీకుతోస్తే, వాటిని వెంటనే నాదృష్టికి తీసుకురా. అందులో ఏయే మాండలికపదాలు నెల్లూరుజిల్లా ప్రజలకు అర్థంకావో ఆ పదాల దిగువను గీతగీసి గుర్తు పెట్టితివా, నాటకం చివర వాటి అర్థాలను వివరిస్తూ వొకపట్టిక చేరుస్తాను.

శ్రీ వేంకటరాయశాస్త్రిగారి 'ప్రతాపరుద్రీయము'వంటి కొన్ని నాటకాలలో కవితాప్రౌఢిమా కల్పనాచాతుర్యమూ లోపించకపోయినా ప్రస్తుతం తెలుగున వెలువడుతున్న నాటకాలన్నీ వొట్టి డొళ్ళసరుకులు. చివరకు ప్రతాపరుద్రీయంలో సైతం పేజీలకు పేజీలు ఎన్నితిప్పినా అవి నాటకకథాగ

---

"విపరీతమైన బడలిక ఆయాసం నాకు బాల్యంనుంచీ వున్నదే. నాశరీరతత్వమే అంతఅనిపించేది. చాలా బక్కపల్చటి మనిషిని. కాని నేను కావించేకృషి మేధోసంబంధమైన కార్యాచరణా అత్యధికం. నేనింతకృషి ఎలాచేస్తున్నానా అని నామిత్రులకే కాదు, నాకే ఆశ్చర్యంగా వుండేది. ఎప్పుడూ పక్కమీద అలావాలి విశ్రాంతి తీసుకోవాలనిపించేది" చూ. మహాకవి డైరీలు : పేజీ 260.

విస్తరణకు పాత్రల పెరుగుదలకు ఉపకరించవు. అయితే యీ నాటకంలో నాకు బాగా నచ్చిన వొక లక్షణంమాత్రం వుంది. మనదేశచరిత్రలో గుండెలను కదిలించే వృత్తాంతాన్నొకదాన్ని తీసుకుని దానిని నాటకంగా వెలయించేటపుడు యీ కవి సాహిత్యాత్మక దేశభక్తిపూరిత కాల్పనిక వాతావరణాన్ని సృష్టించుకొని దానిని నేర్పుతో జయప్రదం చేశాడు. కాని నాటకంలోని చారిత్రకచిత్రీకరణమటుకు కేవలం అభూతకల్పన; అసంభావితవిషయాలు సారస్వతకట్టుబాట్లను లైసెన్సును అతిక్రమిస్తున్నాయి. నువ్వు 'ప్రతాపరుద్రీయం' చదివే వుంటావు; కనక దానినిగురించి ప్రస్తావించాను.

శ్రీ వీరేశలింగం, చిలకమర్తి రచించిననాటకాలను నువ్వు చదివివున్నట్లయితే, వాటిమీదనో, లేక నాకు తెలిసిన తదితర నాటకాలనుగురించో కాదా నువ్వుచదివే నాటకాలను నాకొక్కొక్కప్రతిచొప్పున పంపినట్లయితే వాటినో పరామర్శిస్తూ నీకు నాటకరచనాశిల్పం అవగతమయ్యేందుకు చిన్న చిన్న సమీక్షలు వ్రాసి పంపిస్తూవుంటాను.

పి. యస్: నాన్నగారెలా వున్నారు? ఆయనకు నా 'ప్రణామాలు'

ఎక్కా హిల్ హౌస్
ఉదకమండలం
17 మే 1909

ప్రియమైన ముని సుబ్రహ్మణ్యాం,

నీ ఉత్తరం అందింది. సంతోషం. ఇంగ్లీషుభాషపై నీకు సిద్ధించిన అధికారానికి, నీ విమర్శనశక్తికి నాకుఆశ్చర్యంవేసింది.

విమర్శకు అవసరమైన ఆలంకారికపదస్వరూపం నీకు చక్కగా అవగతమయింది. ఈవిషయమై నీకు నేను బోధపరిచేది ఆట్టే వుండదనుకుంటాను. కన్యాశుల్కంమీద వొక సమీక్ష వ్రాయి *. అది ఏదో వొక మద్రాసు దినపత్రికలో అచ్చుఅయ్యేటట్టు చూస్తాను. నాటకం వెలువడినవెంటనే నీకుకొన్ని ప్రతులు పంపమని నా పుస్తకవిక్రేతలు మెస్సర్స్ వి. రామస్వామి శాస్త్రులు అండ్ కో, ఎస్ప్లనేడ్‌కు వ్రాస్తాను. [ప్రొప్రయిటరు మిస్టర్ వి. వేంకటేశ్వర్లు మంచి సాహితీపరుడు; ఆయనతో నువ్వు తప్పక పరిచయం చేసుకోవాలి] కన్యాశుల్కము ప్రతులు అందగానే కొన్నిటిని స్నేహితులకు బహూకరిద్దువు గాని; మిగతావాటిని స్థానికపుస్తకవిక్రేతలద్వారా అమ్మించే ఏర్పాటుచేయగలవనుకుంటాను. 'నీలగిరిపాటలు' కన్యాశుల్కము పీఠిక నిన్ననే నీకు పంపించాను. నువ్వుకనక సమీక్షించేటట్లయితే పాటల్ని దృష్టిలో పెట్టుకో. ఏమంటావా నాకు గ్రాంథికం వ్రాయడంచేతకాక కన్యాశుల్కం నాటకాన్ని వాడుకభాషలో వ్రాశానని శ్రీ కొక్కొండవేంకటరత్నంపంతులు కోవకుచెందిన పండితులు అంటే అనవచ్చును.

తెలుగు వ్యాకరణం వ్రాతామనుకున్నానా ఆరంభించిన పని అలాగునే నిద్రపోతూ వుంది. నేనుచేయవలసినపని ఎంతైనా వుంది. ఆరోగ్యంమటుకు బాగుండడంలేదు. నువ్వు నాకు

* "వారి ఆజ్ఞానుసారము కన్యాశుల్కనాటకమునకు నీలగిరిపాటలకునుగూడ నేను 1909-1910 సంవత్సరములో విమర్శలు వ్రాసియుంటిని. హిందూపత్రికలో ప్రచురణ అయ్యేనుగాని కాపీ యిప్పుడు నావద్దలేదు." శ్రీ సుబ్రహ్మణ్యంగారి వాక్యాలు.

చేదోడువాదోడుగా వుండాలని నా కోరిక. జీవితంలో యేవృత్తి స్వీకరించడమనే కదా నీప్రశ్న? నీకు సాహిత్యకృషే, తగినదని నాసలహా. నే ననుకుంటున్న సారస్వతకృషి ఏమౌతుందో చూడ నీయి; అదే కనక ఫలించి వ్యాపారంగా రూపొంది పంటముఖానికి వస్తే నువ్వూ నాతోపాటు వుందువుగాని; నాసహచరునిగానిన్ను నేను తీసుకుంటాను. అందాకా అక్కడనే అంటిపెట్టుకునివుండు. నా మిత్రులు శ్రీ గిడుగు రామమూర్తి పంతులు 'రిప్పన్సు హిందూహైస్కూలు'ను తమ మేనేజిమెంటులోనికి తీసుకోవాలని తలపోస్తున్నారు. ఆయనే కనక అది తీసుకుంటే నీకందులో స్థానం లభించగలదని వాగ్దానం చేస్తున్నాను. రిప్పన్సు హైస్కూలును ఆధునికపద్ధతులలో నిర్వహించి దానిఫలితం ఏమిటో చూడాలని రామమూర్తి పంతులు ఆశయం. అందువల్ల నీకు ఆ స్కూలులో పనిచేయడం చాలా ఆహ్లాదకరంగా వుంటుంది. విజయనగరంలో నువ్వుంటే మనంచేయలేని పనంటూ యేదీ వుండదని నానమ్మకం. స్కూళ్ళయినస్పెక్టరూ సిండికేటుమెంబర్లలోని మనదేశస్థులూ మనకు సహాయపడతారు. మనమంతట మనమే సహాయం చేసుకోగలమని నా అభిప్రాయం.

పి. యస్: చిలకమర్తి 'పారిజాతాపహరణం'వొకకాపీ పంపించు.

*　　　*　　　*

ఎక్కాహిల్ హౌస్
ఉదకమండలం
21 మే 1909

ప్రియమైన సుబ్రహ్మణ్యాం,

'పదములపట్టిక'ను పంపినందుకు నీకనేక ధన్యవాదాలు. మీనాన్నగారు అమ్మగారు క్షేమంగా వున్నారని తెలుసుకొని

చాలా ఆనందించాను. మీనాన్నగారికి నాప్రణామాలను తెలియ చేయవలసినదిగా కోరుతున్నాను.

నా నాటకం నీకు నచ్చినందుకు సంతోషం. నీ అభిప్రాయానికి నేను విలవయిస్తాను. నువ్వుపంపిన 'ఫారాలను' చదివాను*. మళ్లీ మళ్లీ చదవాలని మనసు పుట్టింది. చదవతగ్గ కావ్యానికి అదే నిజమైన పరీక్ష. విస్మయకారణాలయిన లక్షణాలను చూసి యే రచయితా ముగ్ధుడు కాడు. రచయితకొక పుస్తకం నిజంగా బాగుందీ అంటే అది అక్షరాలా సొగసుగా వుందని, దానర్థం. 'కన్యాశుల్కం' నాటకంలో నిజమే మీనాక్షి కనిపించే దృశ్యాలు అంత నీతిదాయకమైనవీ ఉపదేశకమైనవీ కావు. అయితే వొకమాట, మాటవరసకి షేక్స్పియరు నాటకాలలోంచి నీకు కొన్నిదృష్టాంతాలను చూపిస్తాను. నాలుగహెన్రీ అయిదవహెన్రీ మెర్రీవైవ్స్ అనే నాటకాలలో తటస్థపడే డాల్‌షీర్‌షీట్ మైసెస్ట్రెస్ డేమ్‌క్విక్లీ మొదలైనపాత్రలు సర్ జాన్‌ఫాల్‌స్టాఫ్‌తో వొక కూటమిగా యేర్పడి యెంతోఆసక్తిని కలిగిస్తాయి. ఈ పాత్రలలో యేదీ

* కన్యాశుల్కము ఫారాలు: "నేను నెల్లూరులో ఉపాధ్యాయుడుగనుండుకాలములో అనగా 1909 వ సంవత్సరములో ప్రూఫునాకంపబడియుండెను. నేను జూచి పంపియుంటిని"

, కొన్ని సందర్భములలో పంతులవారికిని నాకును భేదాభిప్రాయములు గలిగి ఉత్తరప్రత్యుత్తరములద్వారా చర్చ జరిగియుండెను. మీనాక్షియను బాల్యవితంతువును మధురవాణియను వేశ్యయు గనపడు నాటకరంగములు ఔచిత్యవ్యతిరేకములనియు నైతికవిరుద్ధ ప్రయోజనకారులనియు ఆ ప్రదర్శనములు యువతీ యువకులకు శ్రేయోదాయకములు గావనియు విమర్శించియుంటిని." —శ్రీ సుబ్రహ్మణ్యంగారు.

ఉజ్జ్వల నైతికశక్తి కలది కాదు. వీరిలో ఎవరికీ మర్యాదా మప్పితమూ వున్నట్లు కనిపించదు. కాని అవినీతిపరుడూ కుటిలుడూ అయిన ఫాల్‌స్టాఫ్, షేక్స్పియర్ పద్ధతిహాస్యానికి శిఖరాగ్రం వలె ప్రాతినిధ్యం వహిస్తున్నాడు. నాకు సమంగా జ్ఞాపకమున్నట్లయితే ఆట్వే అనే నాటకకర్త అనుకుంటాను, 'వెన్నిస్ ప్రిజర్వుడ" నే తన నాటకంలో విసిగెత్తించే వొక రంగాన్ని సృష్టించాడు. అందులో వొకానొక ఉన్నతప్రభుత్వోద్యోగి అతినీచమైన వొక వుంపుడుకత్తెముందు పరువు పోగొట్టుకుని తననుతానే క్షూణత పరుచుకుంటాడు.

వాస్తవికరచన అనే దానిని కళానైపుణ్యంతో ఎంత ఆదర్శపూరితం చేసినప్పటికీ, విధిగా అది కొన్ని లక్షణాలను ప్రస్ఫుటీకరింపక తప్పదు. వాస్తవికరచనాపద్ధతికి నైతికభావాలను గురించిన ఆక్షేపణ కొంతవరకు వ్యక్తుల స్వభావాలనుబట్టి పర్పడుతుంది.

మీ పినతండ్రి కుమారుడు శ్రీ పట్టాభి రామమూర్తి సాంగత్య ఫలితంగా నీకు అవినీతి అంటే పరమ అసహ్యాం. సాని పిల్ల నిన్ను షాక్ చేస్తుంది. నీతిపై నీకుగల సున్నితమైన అభిప్రాయానికి నిన్ను నేను అభినందిస్తున్నాను. అందువల్ల యీ సమస్యను సాకల్యంగా నీతో నేను చర్చించదలచుకో లేదు. నువ్వు నీ వయస్సుకు మించిన జ్ఞానవంతుడివి.

కవితాన్యాయం నిన్న మొన్నటిలాగ నేడులేదు. మానవ జీవితాన్ని నేను చిత్రిస్తాను. చిత్రిస్తూ కళా నైపుణ్యంతో ఆదర్శపూరితం చేస్తానే అనుకో. కవితాకళకు నేను వొదిగి వుండవలసిన వాడినే అయినా మానవ సమాజంపట్లనాకొక మహా

త్తరమైనబాధ్యత వుంది. కనుక పాఠకులు నన్నొక ప్రశ్న అడగవచ్చును. నేను వొకదోషాన్ని దుర్నడతను ఆకర్ష వంతం చేశానా ? చేయలేదనే భావిస్తున్నాను. కన్యాశుల్కం మొదటి కూర్పులో మధురవాణి వర్ణింపరాని హేయమైన నడవడిక గలది: ఆ పాత్రకు ఎట్టి వన్నెచిన్నెలూ లేవు. నాటకం రచిస్తున్నకొద్దీ మధురవాణి పాత్రమీద నాకున్న దృక్పథం మారుతూ వచ్చింది. అందువల్ల, పరస్పర విరుద్ధ లక్షణాలు వాటంతటవి వచ్చి పడినవేమే నాకు తెలియదు.

అయితే మానవ స్వభావంలోనే పరస్పరవైరుధ్యం వున్నది కనుక దీనిని గణుతింప నక్కరలేదు. మధురవాణిపాత్ర అంటే నాకు నేనే ముచ్చట పడుతున్నాను. కనుక ఆమెను చివరి అంకంలో సంస్కరించాను. ఇంక నీతో నాకువివాదగ్రస్త విషయమేమీ లేదు.

కన్యాశుల్కం నాటకం పిలవని పేరంటానికి 'మాఅప్ప పట్టుచీరె కట్టుకొస్తాన'ని బయలుదేరి యేదో వొక నైతికోద్దేశాన్ని ప్రత్యక్షంగా బలవంతంగా నెత్తిన రుద్దదు. కాని దానికి ఒక మహత్తరమైన నైతిక ప్రయోజనం వుంది.

మానవ జీవితంతో నేను చెలగాటం ఆడడం లేనేలేదు. ఈ సంగతి నా నాటకం చదివితే నీకు తెలుస్తుంది. ఎట్టి తృణీకారభావమూలేకుండా మానవజీవితాన్నిగంభీరమైన దానినిగా భావించి యీ నాటకంలో దానిని యితివృత్తంగా స్వీకరించాను. ఆద్యంతం నవ్వు తొణికిసలాడేటట్టు యింత గంభీర యితివృత్తాన్ని నిర్వహించడం అంత తేలికైన పనికాదు.

సానిపిల్లలో వుండే మానవత్వాన్ని నువ్వు మరిచిపోకు. ఆమె సైతం వొక మానవవ్యక్తి అనే మాటను విస్మరించకు. ఆమె విచారం కన్నీళ్లూ సంతోషం ఆనందబాష్పాలూ నీ నా సుఖదుఃఖాల వంటివే! మన అనుభూతులకు వలె అవీ గణుతింప తగినవే. గంభీరమైనవే!

అవినీతిపరురాలైన వొక భార్యా లేక వ్యభిచారి అయిన వొక భర్తా కాదా వీరిద్దరితోనూ కూడిన సమాజమూ పరిత్యాజ్య వొక సానిపిల్లకంటె మిన్న? వ్యభిచారమే తనవృత్తిగా 'లేబిల్' వేయబడ్డ భోగంపడుచు సమాజాన్ని మోసగించడం లేదు. ఆమెకున్న లేబిల్ దృష్ట్యా ఆమెజీవితం సరియైనతోవనే సాగుతున్నది. ఆమె యే వివాహబంధనాలను వైవాహిక సూత్రాలనూ ఉల్లంఘించడం లేదు.

జపానులో 'గైషా' అనే వొక తరగతి వేశ్యలను ఉన్నత ప్రభువులు, రాజవంశీకులు వివాహమాడతారు కదా, మరి దీనికి నువ్వేమంటావు? గ్రీకు దేశపు ఆస్పేషియాలనుగురించి నీకు తెలిసే వుంటుంది. లాండన్నొకసారి చదివిచూడు. చరిత్రలో గ్రీకు జపానులు ప్రసిద్ధికెక్కిన దేశాలని గణుతికెక్కాయి.

ఉన్న అసలుసంగతి యిదీ: సృష్ట్యాది వివిధపరిణామాలను తెలిపేది మానవశాస్త్రం. మానవపరిణామశాస్త్రాధ్యయనమూ శాస్త్రవిమర్శనశక్తి ఎక్కువవుతున్న కొలదీ, ఈజ్ఞానం వొక పరమసత్యాన్ని నొక్కినొక్కి చెబుతున్నది. ఇప్పుడున్న సాంఘిక భావాలు పోయి వాటిస్థానే కొత్తవి రావలసినఅవసరానికీ అగత్యానికీ, మానవపరిణామవాదం దారితీస్తున్నది కంటిఎదుట స్పష్టంగా కనిపిస్తున్న వాస్తవికవిషయాలకు భయపడి వాటిని

మరుగుపుచ్చి తప్పించుకు తిరగడంవల్ల ప్రయోజనం లేదు. స్త్రీ పురుషలైంగిక సంబంధాలకు అనవసర ప్రాముఖ్య మివ్వడంలో అర్థమేముంది; ఔచిత్య మేముంది ?

సామాజికపరిణామచరిత్రలో వివాహసంస్థకున్న ప్రాధాన్యాన్ని నేను తక్కువ చేస్తున్నాననుకోకు. మానవజాతి గడచిన రెండుశతాబ్దాలలోను అమోఘమైనవిజ్ఞానాన్ని పొంది పురోగమించింది. గొప్ప గొప్ప ఆలోచనాపరులు ధీశాలురు పాతకాలపు అభిప్రాయాలను, ఆదర్శాలను పరీక్ష చేయడానికుపక్రమించారు. వివాహసంస్థ పురోగతికి దోహదం చేసినదన్న మాట నిజమే; అయితే వివాహబంధాన్ని తెంచుకోరాదనే నియమం చెప్పనలవికాని కన్నీటిగాథలకు కారణం. ఈసత్యాన్ని మన మెవరమూ విస్మరింపలేము. ఈ కథ యింతటితో ముగియడం లేదు.

ఇంగ్లీషువారికి వివాహం వొక సివిల్ కాంట్రాక్టువంటిది. షెల్లీ, జార్జియిలియటులు జుగుప్సతో వివాహమనేభావాన్ని త్రోసిపుచ్చి అవతలకు ఎగురకొట్టివేశారు. ఆధునికమహిళలు మానవచరిత్రను తిరిగి రచిస్తారు.

నేడు ఉదాత్తశృంగారకల్పనలలో శృంగారకథావస్తువు అదృశ్యమౌతున్నది. దానికి ప్రాముఖ్యము తగ్గిపోతున్నది. లేదా అది ద్వితీయస్థానాన్నిమాత్రమే పొందగలుగుతున్నది. స్త్రీపురుషశారీరకవాంఛలనుగురించి కామప్రవృత్తినిగురించి కావ్యఇతివృత్తాలలో మార్పుకనిపిస్తున్నప్పటికీ సాహిత్యం కేవలం వీటితోనే ఎందుకు నిండివుండాలి? 'స్త్రీపురుష' శారీరకవాంఛలు

కామప్రవృత్తి' అనే పదాలను ప్రత్యేకం గుర్తుపెట్టుకో. లైంగిక వాంఛలు శారీరకపరిస్థితులపై ఆధారపడి వున్నాయి.

చికాకులతో జీవితంలో వొడిలిపోయిన ఏభై యేళ్ళ ముసలిదానిని వొక నవయువ్వనుడు యెందుకు ప్రేమించడు? వేడివేడి భోజనపదార్థాలవలెనో వికసించిన ఎర్రగులాబీవలెనో కాలంలోవున్న ఆడది యింద్రియాలను ఆకర్షిస్తుంది. మేకుల్లా వున్న చల్లనిఅన్నం చివిఁడిముద్దయిన అన్నం వాడిపోయిన పువ్వూ; వీటిని నువ్వు ఖాతరుచేయమన్నా చేయవు. వేడివేడి అన్నం మల్లెపూవుల్లా తెల్లగా వుమ్మగిల్లిన అన్నం నీ చవులూరిస్తుంది. అదేవిధంగా వికసించిన రేకులతో పరిమళమిచ్చే గులాబీ! ఇవి చెడిపోనపుడు దుమ్ములో కలిసిపోనపుడు మంచి పసందుగావున్న తరుణంలో నువ్వు వాటిని అనుభవించకుండా అవి నిన్ను వారించడం లేదు!

'జీవితం నీటి బుడగవంటిదని సౌందర్యం అశాశ్వతమని' సిద్ధాంతాలుచెప్పే వేదాంతుల సూక్తుల మాటకేంతే! ఈ వుత్తుత్తి కబుర్లన్నీతీసి అవతలపెట్టు. జీవితమూ సౌందర్యమూ అశాశ్వతమైనవని చెప్పే సిద్ధాంతాలు యింద్రియసుఖాలు పరిత్యజింప తగినవనే వాదానికి బలాన్నీయవు. జీవితమూ సౌందర్యమూ అశాశ్వతమైనవని చెప్పినంత మాత్రంచేత యింద్రియసుఖం విడువ తగిందికాదు. నిజమాలోచిస్తే యిలాటి వాదములవల్ల యింద్రియసుఖాలు అనుభవింపతగినవనేవాదం ధృవపడుతున్నది.

దోషమన్నది అతిలోలత్వంలో యింద్రియచాపల్యంలో యిమిడివుంది. మితిమీరిన చపలత్వం దోషంకాదా మరి? ఈ అతిలోలత్వపు ఫలితం వెంటవెంటనే కనిపిస్తుంది.

మానవజీవితంలో కాని లేదా సారస్వత కల్పనలలో కాని ఎందులోనైనా స్త్రీపురుషశారీర కానుభవాలూ ఆనందాలూ వాటి వర్ణనలూ తత్తదుచితస్థానంలో వుండాలి. ఇపుడు వీటికి అనుచిత ప్రాధాన్యమిచ్చి గోరంతలు కొండంతలు చేస్తున్నారు.

రోమనుడైన * 'కేటో' ఎవరికో సరిగా జ్ఞాపకంలేదు కాని, తనభార్యను ఎరువుయిచ్చాడు. చంద్రవంశపు పట్టమహిషలను వుండాకోరులైన బ్రాహ్మణులకు బాహాటంగానే తార్చినట్లు కనిపిస్తుంది. బాహాటంగా జరిగినవే యిలావుంటున్నపుడు యింక రహస్యంగా ఎన్ని దుర్మార్గాలు అవినీతికర చర్యలు దోషాలు జరిగాయో కదా? మీ యితిహాసాలను పురాణాలను వొక్కసారి చదివిచూద్దూ నీకేతెలుస్తుంది !

---

* మార్కస్ పోర్షియస్ అనీ కేటోమేజర్ అనీ ఇతన్ని పిలిచేవారు. ఉన్నత వంశీకుడు; సామాన్యులతో సాయిలా పాయిలాగా తిరిగేవాడు. అనేక ఉద్యోగాలు చేశాడు. సైన్యంలో కొంతకాలం పనిచేసి రోము నగరం చేరుకున్నాడు. ఆనాడు జరిగిన మతయుద్ధాలలో పాల్గొని స్పెయినును లోబరుచుకున్నాడు. ఎలాంటి మార్పులకూ అంగీకరించని మనస్తత్వం కలవ్యక్తి. ఇతనికాలం క్రీ. పూ. 234-149.

ఇతనిమునిమనుమడు కేటోది యంగర్. స్టోయిక్ వేదాంతాధ్యయన నిమగ్నుడై కాలం గడిపినవ్యక్తి. నాటి రాజకీయరంగంలో కీర్తిగడించిన వ్యక్తులపై నిరసనభావం; ముఖ్యంగా సీజరుపై అయిష్టం. పాంపే, సీజరులలో పాంపేను ఇతను సమర్థించి అతనిపక్షం అవలంబించి, పాంపే ఓడిపోగానే, 'ఉటికా' చేరుకున్నాడు. సీజరు చేతులలో చిక్కకుండా చివరకు ఆత్మహత్య చేసుకొన్నాడు. ఇతనికాలం క్రీ. పూ. 95 - 46.

నువ్వు వాస్తవికవిషయాలను యదార్థాలను కప్పిపుచ్చకు. ఇంతే నేను నిన్ను కోరుతున్నది. రోగికి డాక్టరు శస్త్రచికిత్స చేసినట్లు సమాజంలోగల రుగ్మతలను కత్తితీసుకొని కోసి దేనికది విడదీసి అన్ని భాగాలనూ పరీక్షించి చూడు.

మనం మూర్తీభవింపచేయవలసిన ప్రేమ విశ్వమానవ ప్రేమ. తోటి మానవుణ్ణి హృదయమిచ్చి ప్రేమించు. నిజమైన ఆరాధించతగిన ప్రేమయేది? తనయుగంలోవున్న అవధులలోనే పోనీ, క్రీస్తు యేది బోధించాడనుకుంటున్నామో దేన్ని కళా విలాసమని కవితాసత్యమని షెల్లీ ప్రవచించాడో ఇదీ ఉత్తమమైన రాజమార్గమని దేనిని బుద్ధుడు మనకు ఉపదేశించాడో అదే నిజమైన ఉన్నతమైన ప్రేమ! మానవజాతిపై మనకు వుండవలసిన ప్రేమ !

ఏనాడు బౌద్ధమతం భారతదేశంలో తుడిచిపెట్టబడిందో ఆనాడే భారతదేశం మతవిషయిక ఆత్మహత్యను చేసుకుంది.

* * *

ఎక్క్రహిల్ హౌస్
ఉదకమండలం
24 మే 1909

ప్రియమైనముని సుబ్రహ్మణ్యం పంతులు,

నీకార్డు అందింది. నాధన్యవాదాలు. నువ్వుపంపిన 'పదముల పట్టిక' చేరింది. వీటిలో కొన్నిశబ్దాలు నిఘంటువులలో నీకగుపిస్తాయి. కన్యాశుల్కం చివర పెద్దజాబితా చేరుస్తాను.

శ్రీ వై. నారాయణమూర్తి* నానాటకాన్ని "అత్యద్భుతమైన కళాసృష్టి" అంటున్నారు. కాని నూటఇరవై ఎనిమిదో పేజీ వచ్చేసరికి ప్రధానోత్సుకత అనే గడపముందు నిలబడ్డట్టు నీకనిపిస్తుంది. అటు తరవాత వచ్చేరంగాలు, నాటకంలో ఉత్తమమైనవని నేను భావిస్తున్నాను.

శ్రీ వేంకటరాయశాస్త్రిగారి 'ఉషా' నాటక ప్రతినొకదానిని శ్రీ వేంకటేశ్వరులు నాకు పంపించారు. పాపం, వేంకటరాయశాస్త్రిగారికి "కళ" అంటే యేమిటో బొత్తిగా తెలియదు. గ్రీకు నాటకాలలో "కోరస్" లాగ ఆంగ్లంలో "ప్రొలోగ్"ల వలె కథాకథనం కోసం ఆయన తన నాటకంలో విష్కంభాలను + ఆశ్రయించారు. నాటకంలోవచ్చే దేవతామూర్తులను వొట్టి పిరికి పందలుగా చిత్రించారు. ఇక బాణాసురుణ్ణంటావా కడు దురహంకారిగా మర్యాదా మప్పితమూ యేకోశానాలేని జడునిగా అమితనీచునిగా తనతండ్రి అని ఉష

---

* శ్రీ ఎనమండ్ర నారాయణమూర్తిగారు: పట్టభద్రులు. చెముడు జమీందారుకు కొంతకాలం ట్యూటరుగానూ కొంతకాలం విజయనగరం కళాశాలలో లెక్చరర్‌గానూ రాజువద్ద కార్యదర్శిగానూ పనిచేశారు. "అడవి మల్లెలు" అనే ఖండకావ్యకర్త. మేఘ సందేశమును అనువదించారు, గ్రాంథికవాది. అప్పారావుగారి సన్నిహితమిత్రులలో ఒకరు.

\+ ఉషా నాటకమున ద్వితీయాంకము తరవాత ప్రవేశకం. ద్వితీయ: [ప్రవేశించి] వొశేబంబరికా, యేమే నువ్వింకా యీతోటని అలంకరించకున్నావు, కౌమార మహారాజు అనిరుద్ధులవారికి మరీయిష్టమైన తోటగదటే యిది !

చెప్పుకుని గర్వపడేందుకు యెంతమాత్రం తగనివిధంగా సృష్టిం
చారు. దిక్పాలకుల్ని బాణాసురుడు "ఒరే!" అని సంబో
ధిస్తాడు. •

బంభరిక : వొశే కీరవాణీ! నీపని రవ్వంత ముంగట అయిందని యేం
బడాయే నీకు!....మునుపంతా యెప్పుడో యిక్కడికి వచ్చే
కొమారమహారాజు యిప్పుడు రోజల్లా వొంటరిగా యీ
తోట్లోనే తిరుగుతూ వుంటాడే అదేమిటి ?

కీరవాణి : ప్రెబువుల చిత్తానికి కారణం యెందుకే ?

బంభ : మరి, జక్కవపిట్టలని జతలుకట్టి వాటిమీద యేమిటేమిటో చిత్రాలు
రాస్తాడే అదెందుకే ?

కీర : నువ్వొక గోడవే ? వీటికోసమే. (అని బంభరిక పాలిండ్లం
బొడుచును.)

బంభ : నువ్వేక్కణ్ణో మడకనిపడ్డావే (మడకనిబడ్డావే = పురుషుని
పొందితివనిభావం.)

కీర : రాయే లంజా, నువ్వుకూడా పడుదువుగాని.

బంభ : యింకొకటిమాత్రం చెప్పు. ఆ వాకలోకి దిగి ఆయనెందుకే
ఆసుళ్ళని వెతికివెతికి ముద్దెట్టుకొంటాడు ?

కీర : చాల్లే యీపాటికి నువ్వేవణ్ణయినా వొకరంగణ్ణి తగులుకొని
రాత్రి వాణ్ణడుగు చెప్తాడు. నీకేమి చీకటి బయంలేదటే ? (అని
నిష్క్రమింతురు)

• ప్రథమాంకము : బాణుడు కుంభాండుడు. రాణి, అహ్లాదనుడు
ఉషాదులు కూర్చునివుండగా బాణుడు తనతపస్సును వర్ణించి దిక్పాలకు
లను చెప్పమంటూ "ఓరి అగ్నీ, ఈకుంభాండాదులు విన మాతపస్సును
వర్ణింపుము. (నిర్వర్ణించి) ఏమిరా, నీవిట్లు బొగ్గువలె నల్లఁబడినాఁ
డవు ?....ఏమిరా వాయూ, నీవేల బ్రొయ్యి యూఁదకుంటివి ? (అని
వాయువును కొట్టనుంకించుచున్నాడు)....మంచిది; చక్కగా వీవుము.

ఈ పరిస్థితులే ప్రధాన కారణము. రచయితలు బుద్ధిపూర్వకముగ కేవలము తమ పాండిత్య ప్రకర్షకోసము జటిల ఆడంబర శబ్దములను తమ రచనలలో ప్రయోగింపరని నా విశ్వాసము. అయితే ప్రాచీన కవుల భావములను ప్రయోగములను యింకొక రూపమిచ్చి తమ గ్రంథములలో ప్రయోగించే రచయితలు లేకపోలేదు. ఏమైనప్పటికి, గ్రాంథికముకొరకే అన్నట్లు ఏ రచయితా, ఆ భాషను తనరచనలలో వాడడని నానమ్మకము. ఇది సంస్కృతి లేకపోవుటవల్ల కాక, ప్రస్తుతము మనకుగల సంస్కృతిని అనుసరించి కలుగుతున్న సహజఫలితము.

గ్రాంథికమును మాత్రమే ప్రయోగింపవలెననే గ్రాంథికవాదులమతము న్యాయమైనది కాకపోవచ్చును. కాని మీరు దానిని అడుగడుగున పూనికవహించి ప్రతిఘటిస్తున్నారు. మన ప్రాచీనరచయితలు తమ గ్రంథములను గ్రాంథికమున వ్రాసినారు. నేటి కాలపురచయితలు తమ రచనలను గ్రాంధికమున వ్రాస్తున్నారు.

దేశమున బహుళ వ్యాపకమును పొందే భాషను వాడవలెననెడి వారి స్థితి, గ్రాంధిక భాషయే అనుసరణీయమనెడి వారి స్థితితో అభిన్నము కావలెను. ఈ ఇరుతెగల రచయితలకు ఎంతమాత్రము స్పర్ధ వుండకూడదు. ఈ రెండు వర్గముల రచయితలు తమతమ ఆదర్శములను అనుసరించి భాషను సేవించవలెననియే అభిలషిస్తున్నారు. కాని ప్రయత్నపూర్వక గ్రాంధిక శైలియో, గ్రామ్యభాషా శైలియో, రచయితలకు లక్ష్య, పరమావధులు కానేరవు. అలాగ ఒకవేళ అయితే కావచ్చును కాని, ఆ శైలి రచయితకు ఆత్మ సంతృప్తిని కలిగించగలదే తప్ప, ఉత్తమప్రయోజనమునకు ఉపకరించదు. తమ నమ్మకము

లకు భంగము వాటిల్లగలదన్న వెరపుతో రచయితలు మార్గము తప్పి, ప్రాచుర్యమునవున్న పదములను కేవలము ఆ పదముల కోసమే అన్నట్లు, ఎంచుబడి చేసినట్లయితే ఉత్తమప్రయోజనము నెరవేరదు. మీరు అంటున్నట్లు మీరు గ్రామ్యభాషలో వ్రాయా లనే నా ప్రార్ధన. కాని సిద్ధాంతములకోసము మీభావములను ఆ శైలిలో వ్యక్తము చేయడానికి ప్రత్యేకముగ ప్రయత్నించ వద్దని నా అభ్యర్ధన. మన మహారచయితలందరు అప్రయత్న పూర్వకముగ తమ భావములను సులభ సరళ శైలిలో వ్యక్తీక రించుటకు ప్రయత్నించారు. మీ రచనలలో మీరు వాడుక భాషాపదములను అక్కడక్కడ ప్రత్యేకముగ ప్రయత్నించి ప్రయోగిస్తున్నట్లు పాఠకునికి పొడగట్టకమానదు. వాడుక భాషపట్ల మీకున్న ఆ పక్షపాతవైఖరిని విడనాడి, మీసహజ ధారాళశైలిలో మీరు వ్రాసినట్లయితే, మీకు మీరు న్యాయము చేసుకున్నట్లవుతుంది; భాషకు సేవ చేసినట్లవుతుంది.

అడగనిదే యిటువంటి అభిప్రాయములు వెలిబుచ్చినం దుకు నన్ను మన్నించగలరని ఆశిస్తున్నాను.

పి. యస్: డెమ్మీసైజులో 12, 24 పేజీలలో అక్కరకు వచ్చే చిన్న చిన్న పుస్తకములను ప్రచురించవలెనని నాసంక ల్పము. 12 పేజీలకు అర్ధణా చొప్పున ధర పెట్టవలెననుకుంటు న్నాను. 48 పేజీలయితే ఒకబేడ; 48 పుటలకు మించి ఏపుస్త కమూ వుండదు. మీకు తోచిన అభిరుచివున్న ఆసక్తివున్న విషయమును గురించి ఒక పుస్తకము వ్రాసి పంపితే మిక్కిలి కృతజ్ఞుడను; నేను భావిస్తున్న ఈ ప్రణాళిక ఏరీతిన వుంటే బాగుండగలదో; కొన్ని సూచనలు సూచిస్తే, కృతజ్ఞుడను.

## పి. శేషాద్రి *

అనంతపురం
5 జూన్ 1912

ప్రియమైన శ్రీ అప్పారావుగారూ,

మీ ఉత్తరం చేరింది. ధన్యవాదాలు. హాంటరు ఊటీనుంచి ఇంకొక నెలలో బయలుదేరుతాడు. మీరు ఆయనను కలుసుకుంటున్నారని తెలియపరిచాను.

ఇక్కడి వాడుకపదాలు తెలిపే కొన్నిపుస్తకాలను మీకు నేను ఇవాళపంపిస్తున్నాను. అందులో కొన్నిపుస్తకాలు బ్రాహ్మణులు రచించినవి: మరికొన్ని శూద్రులు వ్రాసినవి; ఇంకొన్ని మహమ్మదీయులు, కల్పించినవి. ఈ పుస్తకాలలో వాడిన మాండలికపదాలలో అంత తేడాకన్పించదు. కాని మహమ్మదీయులు రచించిన పుస్తకాలు పరిశీలించతగ్గవి. ఈ జిల్లాలో హిందువులు మాట్లాడే కొన్నిమాటలను వాళ్ళు చిత్రంగా ప్రయోగించారు. రేపో ఎల్లుండో మరికొన్ని పుస్తకాలు సేకరించి పంపుతాను.

నేను తెలుగు సాహిత్యంమీద ఒకవ్యాసం వ్రాయాలనుకుంటున్నాను. ఆంధ్రసాహిత్యంలో నూతనపోకడలను పరిశీలిస్తున్నాను. ఆంధ్రకవితలో నూతనధోరణులనుగురించి "న్యూ

* కాశీ హిందూవిశ్వవిద్యాలయంలో కొంతకాలం, మద్రాసు క్రిష్టియన్ కళాశాలలో మరికొంతకాలం ప్రొఫెసరుగాపనిచేశారు. మహాకవి రచించిన, 'పూర్ణమ్మ' కాసులు, లవణరాజుకల, ముత్యాలసరములు, డామన్ పితియస్, నీలగిరిపాటలు, ఇత్యాదిఖండకావ్యములపై, శ్రీ శేషాద్రిగారు, ఆంగ్లమున 'న్యూకరెంట్సు ఇన్ తెలుగు సాంగ్' అనే వ్యాసంవ్రాశారు. చూ: 'ది ఎడ్యుకేషనల్ రివ్యూ' జూలై 1913.

కరెంట్సు ఇన్ తెలుగులిటరేచర్" అనే పేరుతోనో లేక "ఎక్స్ పెర్మెంట్సు ఇన్ తెలుగుపొయిట్రీ" అనే శీర్షికతోనో మీ గేయము లనుగురించి ఒక వ్యాసము వ్రాయవలెనని కుతూహలపడు తున్నాను. మీ నీలగిరిపాటలు ప్రతి నావద్ద వున్నది. ఇతర రచ నలు కొన్నింటిని పంపించకోరుతున్నాను. మీ గీతములను తిరిగి మీకు అందచేస్తాను. మీరు కులాసాగావున్నారని తలుస్తాను.

టి. సూర్యనారాయణరావు

తణుకు
18–6–12

ప్రియమైన అయ్యా,

మీరు దయతో వ్రాసిన లేఖ అందినది. నేను మీకు వెం టనే జాబు వ్రాసితిని; కాని మా గుమాస్తాలు దానిని ఆలస్య ముగా పోస్టు చేసితిరి. మనమనుకున్న కార్యము జూలై నెలలో తప్ప నెరవేరదు. రామచంద్రరావు ఇతర పనులలో నిమగ్ను డై నాడు. అతను మనవెంట రావలె.

మీరు లేవనెత్తిన సమస్య మిమ్ములను కలుసుకొన్న పుడు చర్చించగలను. ఉత్తరములలో చర్చించడమువల్ల లాభము లేదు. మనము ఒకరినొకరము అపార్థము చేసుకుంటున్నామని నా అభిప్రాయము. చర్చించి ఒక అభిప్రాయమునకు వద్దాము. పత్రికలలో చర్చలు చూసితిని కాని ఏమి ప్రయోజనము?

ఉదాహరణకు మద్రాసు మెయిలులో అచ్చయిన వ్యాస మును తీసుకోండి వ్యాసమంతయు, అపార్థద్యోతకముగానే వ్రాయబడినది, అకాడమీ సమావేశ ఉద్దేశములను, దాని అభి ప్రాయములను వ్యాసకర్త అపార్థము చేసుకున్నాడు. శృంగార

కావ్యముల సమస్యను ఆయన సరిగా అర్థము చేసుకోలేదు. పత్రికలలో వ్రాతలు ఇలాగునే వుంటవి.

పత్రికలలో చర్చలవల్ల ప్రయోజనము సిద్ధించదు. వ్యక్తిగత సమావేశములు, చర్చలవలన భాషకు నిజమైన ఉపకృతి చేకూరగలదు. ఓటమి, గెలుపులను లెక్కచేయక, మర్మము విడిచి మనసువిప్పి చర్చించుకొనవలెను.

నేను రచించిన గ్రంథములను మీకు పంపినాను వ్యాకరణసూత్రములను పాటించుతూ మీ ఆశయములను నేను సాధించినాను. ఆర్థికచరిత్ర రాధారాణి మాధవకంకణము మొదలైన నా గ్రంథములను మీరు పరిశీలించిన ఈ విషయం తెలియగలదు. అవి బాగుగానేవున్నవందురనుకుంటాను. ఇపుడింకొక పుస్తకమును అచ్చువేయించుతున్నాను. అచ్చయిన వెంటనే మీకొక ప్రతిని పంపగలను. అవును, నేను అందులో విరళముగా విసంధిని పాటించితిని.

మీరు ప్రబోధిస్తున్న సంస్కరణమువలన, గ్రామ్యశబ్దములను ప్రయోగించి, ఆ గ్రంథములను ప్రజలకు విడుదుచెట్టు అవకాశము కలుగుతున్నది. ఈ భాషనే ప్రభుత్వము ఆమోదించవలెనని మీ పట్టుదల. సరిగ్గా అదే ఎంతమాత్రమూ కూడదని నామతము. ఈసారి వ్రాసే ప్రత్యుత్తరములో వివరముగా పేర్కొనగలను.

*        *        *

## శ్రీ. జి. వెంకటరంగారావు *

ట్రిప్లికేన్
2-7-12

ప్రియమైన శ్రీ అప్పారావుగారూ,

జూన్ 30 వతేదీన మీరు వ్రాసిన లేఖ అందింది. శృంగార రసవిషయమై, మనదృక్పథమేమిటో మీరు శ్రీ జె. అచిన్సన్‌కు బోధపరిచినందుకు సంతోషం. గ్రాంథ్యం మీరు పంపించమన్నారని శ్రీ వెంకటేశ్వర్లుకు ఇదివరకేచెప్పాను. కాని ఇంకా పంపలేదు. ఆ విషయం మళ్ళీ హెచ్చరిస్తాను. బెంగాలీలో పారిభాషిక పదాలనుగురించిన వివరాలు, రిప్పన్ కళాశాల ప్రిన్సిపాల్ మీకు తెలియచేశాడా? పట్టిక అందినదా? అందకపోతే మళ్ళీ ఒకసారి ఆయనకి ఉత్తరం వ్రాద్దురూ;

ఆనర్సుపేపర్లు మీరు నాకు పంపనక్కరలేదు. వాటిని గురించి భోగట్టా అందేవరకు దాయండి. ఈ కమిషనును మన చెంతకు ఎందుకుపంపించాలో నాకర్థంకావడంలేదు. సంగతులు ఎప్పటికప్పుడు మీకు తెలియపరుస్తూవుంటాను. ప్రొఫెసరు రంగాచారిగారు నెమ్మది నెమ్మదిగా కోలుకొంటున్నారు. గండం గడిచి బయటపడినట్లేలెండి. మా భావమరిది సంగతి మరవరని తలుస్తాను. నేను చెప్పినది, దయయుంచి జ్ఞాపకంపెట్టుకోండి. నారాయణమూర్తి, మంగపతినాయుడుగార్లకు నా నమస్కారాలని చెప్పండి. ఎస్టేటుల్యాండు ఆక్టు విషయమై ఫౌలరు ఒక పెద్ద జవాబు వ్రాశారు.

* * *

---

* గుమ్మడూరి వెంకటరంగారావు.

ట్రిప్లికేన్
8 జూలై 1912

ప్రియమైన శ్రీ అప్పారావుగారూ,

నిన్ననే మీ వుత్తరం అందింది. కొత్త ఏర్పాట్లుకు మహారాజావారు అంగీకరించినందుకు సంతోషం. శ్రీ శ్రీనివాస అయ్యంగారు ఊటీనుంచి నిన్న తిరిగి వచ్చారు. ఆయనను కలుసుకొని చాలాసేపు ప్రసంగించాను. శ్రీ యస్. నాయర్ గారి సంగతంతా ఆయనకిపుడు తెలిసింది. పూర్వం ఆయనకుండే వున్న భ్రమలన్నీ పోయి నాయర్ గారి అసలు వ్యక్తిత్వాన్ని చూడగలిగారు. అందుకు నాకెంతో సంతోషంగావుంది. ఆయనతో నాకుకలిగిన ఆ కొద్దిపాటి పరిచయంవల్ల, శ్రీ వి. కె. అయ్యర్ గారి దూరదృష్టివల్ల, నాయర్ గారి స్వభావం నాకా నాడే తెలిసింది. అయ్యరుగారు మనుషుల వ్యక్తిత్వాన్ని అవలీలగా ఆచూకీ తీసి, ఇట్టే కనిపెట్టగలిగేవారు. మెరిసేదంతా బంగారంకాదు. అలా అనుకొనేవాళ్ళకు నాయరుగారి పోకడ ఒక గుణపాఠం.

ఈవేళ రాత్రి ప్రొఫెసర్ రంగాచారిగారిని చూడడానికి వెళతాను. మీ సందేశాన్ని ఆయనకు అందచేస్తాను. ఆయన ప్రయాణంచేసే స్థితిలో లేరు. నీరసం తగ్గడానికి ఇంకొక నెల పడుతుంది. బ్రౌను నిఘంటువుమీద, శృంగార రసంమీద మీ వ్యాసాలను సాధ్యమైనంతత్వరలో నాకు పంపించకోరుతున్నాను. కావ్యప్రకాశికను ఇవాళ మీకు పోస్టుచేశాను. ప్రస్తుతం నేను క్షేమేంద్రుని ఔచిత్య విచారచర్చను పరిశీలిస్తున్నాను. చక్కగా వుంది.

* * *

ట్రిప్లికేను
1-2-13

ప్రియమైన అప్పారావుగారూ,

మీరు నిన్న వ్రాసిన ఉత్తరం అందింది. ఎమ్.ఏ. పరీక్షాధికారుల సమావేశం మీరు సూచించే తేదీన మనం ఏర్పాటు చేసుకుందుకు నాకు సంతోషం. కానినాకు నాలుగయిదు రోజుల వ్యవధిఅవసరం. అందుకుఏతేదీ మీకు అనుకూలమో, ముందుగా తెలపండి. 15 వ తారీఖున మీకు వీలుంటుందా? సూర్యనారాయణశాస్త్రిగారు ఈవేళపొద్దున్న నన్ను కలిశారు. 15 వతేదీన సమావేశం జరుపమని ఆయన సూచన.

వి. సూర్యనారాయణరావుగారు

మచిలీపట్నం
20-6-14

ప్రియమైన అప్పారావుగారూ,

మీ వ్యాసములను పత్రికలలో చదువుతున్నాను. జయంతి రామయ్యగారివల్ల భాషాభివృద్ధి జరగదు. తెలుగు అకాడమీ స్వరూపం మారితీరాలి. శబ్దశాస్త్రాన్ని మధించిన గిడుగు రామమూర్తి పంతులుగారివంటి దిగ్గజాలు మనకు అవసరం. నిఘంటు వ్యవహారం* అతి అసహ్యాకరంగా తయారయింది. జరుగుతున్న జాప్యం అంతా ఇంతా కాదు. నిఘంటు నిర్మాణంగురించి కొవ్వూరు న్యాయవాదులు శ్రీ తల్లాప్రగడ సూర్యనారాయణరావుగారు వ్రాసిన వ్యాసం మీరు చదివి

* ఆంధ్ర సాహిత్యపరిషత్తువారు తలపెట్టిన నిఘంటు నిర్మాణం, సూర్యరాయాంధ్ర నిఘంటువు.

వుంటారు. ఇది మీ స్వంత విషయంగా భావించి మీరు పూర్తి బాధ్యత వహించకపోతే నిఘంటు నిర్మాణం జయప్రదం కాదు. మీ రిప్పటికే వృద్ధులయిపోయినారు. వెనకటి ఓపిక లేదు. చరిత్ర రచన అలాగునే వుంచివేసినారు. ఇతర వ్యాపకాలు తగ్గించుకొని, మీరు తలపెట్టిన చరిత్రను, పూర్తిచేయడం మంచిది. దానినీ నిఘంటువును దేశానికి మీరు సమర్పించాలి. మీరనుకుంటున్న విశాఖజిల్లా చరిత్ర త్వరలో వెలువడితే, అది, ఇతర జిల్లాలవారికి ఆదర్శప్రాయంగా వుంటుంది మీఆరోగ్యం ఎలాగ వుంది? విజయనగరం ఎప్పుడు వెళతారు?

ఎనమండ్ర నారాయణమూర్తిగారు*

కలకత్తా
12-12-12

మిత్రమా,

నేనిక్కడ క్షేమముగా ప్రవేశించినాడను. మీరు మెద్రాసుకు బయలుదేరి యుందురు కావున దీని నక్కడికి బంపవలయునని యింగ్లీషు మునిషీకి జెప్పి వారిపేర బంపుచున్నాను.

ఇంతవేగముగా మీకు త్తరము వ్రాయవలసిన పని లేకపోవును గాని నిన్న నేను తొందరగా నజరుమహాలుకు బోవుచుండగా మీరు కొన్ని మాటలు శెలవిచ్చినారు. అందుకుత్తరము వెంటనే చెప్పలేకపోయినాను. మీవంటి పురుషుల ప్రశ్న

* పట్టభద్రులు, చెముడు జమీందారుకు కొంతకాలం ట్యూటరు; విజయనగరం కళాశాలలో కొంతకాలం లెక్చరరు. రాజువద్ద సెక్రటరీ. గ్రాంధికభాషావాది. 'అడవిమల్లెలు' మొదలైన పద్యకావ్యాలను రచించారు.

ములకు దగిన జవాబు చెప్పుటకు కొంతయాలోచన కావలెను; అప్పటినుండియు జిత్తమాయంశములందే కాపురముండి యీ యుత్తరము వ్రాయువరకు నుండబట్టినది కాదు.

మీరు నాయందు రెండు నేరములు మోపినారు. మెద్రాసు మహాజరుకు, సంతకము చేయుట మతభేదముచేత మీకివి నేరములుగా గాన్పించుట న్యాయమే. కాని నాకెలాగు నేరములు? నేనొకరికేల భయపడవలెను. అమూల్యమైన మీ స్నేహము దీనివలన బోయునేని యీ పనులు తప్పే. కానియది యింతటితో బోయెడి భాగ్యముకాదు; మీరును నాకభిప్రాయ స్వాతంత్ర్య మియ్యనంతటి సామాన్యులు కారు. ఒక్కచో నాపని నిందార్హమే యగును. మనమందరము సత్యప్రియులము ఎంతటి సామాన్యుడును సత్యము దాటినప్పుడేదో మిష కల్పించుకుదాటును గాని సత్యము నాకవసరములేదని చెప్పి తప్పడు. కాబట్టి నే జేసినపని యిదివరలో నా మతమును ప్రకటించు

---

*. బ్రిటిష్ గవర్నమెంటువారు ఏర్పరచిన విద్యాశాఖవారు ఉపేక్షించుటవల్ల దేశభాషారచనాభ్యాసము పూర్వసంప్రదాయంప్రకారము బడులలో జరుగలేదు. దానికిమారుగా "కృతకగ్రాంధికాంధ్రభాష" పెద్దల ఆదరణకు పాత్రమైనది; శిష్టవ్యవహారమందున్న వాస్తవమైన దేశభాష 'గ్రామ్య'మైనది. పూర్వ సంప్రదాయం మరల నెలకొల్పుటకు వ్యావహారిక భాషాభిమానులు చేసిన ప్రయత్నము ఆంధ్రసాహిత్యపరిషత్తు వారి అసత్య ప్రకటనవల్ల నిష్ఫలమైనది.... 1857వ సం॥ మొదలుగా బడులలో తెలుగుపిల్లలకు విద్యనేర్పడమునకు చేసిన ప్రయత్నములు, లోకవ్యవహారములో ఎక్కడా, ఎప్పుడూ, ఎవ్వరూ (పండితులయినా) వాడని ప్రాచీనాంధ్రభాష విద్యాబోధకు సాధనముగా అంగీకరించడము చేత, నిష్ఫలమయినందున, శిష్టవ్యవహారమందున్న తెలుగు భాషనే

కొనిన దానికి విరుద్ధమయిన యెడలగాని సంతకములు చేయించు టకు దంటాలు పడుటలో నేనితరుల నిర్బంధించి వంచించిన గాని నాయందు దోషారోపణ చేయవచ్చును. మొట్టమొదట నేను తంటాలు పడనేలేదు. అవకాశములు నాకు వచ్చినరోజునే మహారాజులుంగారు విజయనగరము వచ్చుటచేత నాకందును గురించి యాలోచించుటకై నను సావకాశము లేక రామానుజా చారిగారి కిచ్చి దొరికినన్ని సంతకములు సంపాదించుమని కోరి నాను. మొన్న సాయంకాలము కొంతమంది తగు మనుష్యులు నాకుదటస్థమైనారు. వారికాగితముల సంగతి కొంచెముబోధ జేసిసంతకములుచేయ నిష్టమున్నచో జేయవలెనని యడిగినాను. అందుపై నొక్కరు అప్పారావుగా రేమందురో అన్నారు. ఆమాట విని వారికిదిపరకిచ్చియున్న సంతకములఫారము లాగి కొందుమన్నంత యసహ్యాము పుట్టినది. కాని తొందరపడక

లౌకికవ్యవహారములలో పెద్దలందరూ వాడుతూన్నట్టి, బడిపిల్లలచేత గద్యరచనాభ్యాసము చేయించవలసినదని ఇంచుమించుగా ఇరవైయేళ్ళ క్రిందట విద్యాధికారులు విధించినారు. ఆ విధానము పూర్వ సంప్రదాయ విరుద్ధమనిన్ని, పూర్వులు ఎవరూ వాడుకభాషలో గ్రంథాలు రచించి ఉండలేదనిన్ని, సంభాషణలో శిష్టులు వాడేదయిన దేశభాష గ్రామ్యమనిన్ని గ్రామ్యభాష ప్రయోగార్హముకాదనిన్ని ఆంధ్రసాహిత్యపరిషత్తువారు ఆక్షేపించినారు. వారి ప్రతిష్ఠా గౌరవమూ పలుకుబడీ ఆకాలమందు అధిక ముగా ఉంటెనందున, వారి అభిప్రాయముచొప్పున, తెలుగుదేశములోని పెద్దలందరూ "తీర్మానాలు'చేసి, గవర్నమెంటువారికి మహజర్‌నామాలు పంపి, చాలా ఒత్తిడి కలుగజేసి 'మాతృభాష' బడిపిల్లలు అభ్యసించ కుండా ఆటంకపర్చి కృతకృత్యులయినారు."

—కళాప్రపూర్ణ గిడుగు రామమూర్తిపంతులుగారు.

అలాంటి మహజర్‌నామాలలో ఇదిఒకటి.

నన్ను సేవారించికొన్నాను. మరునాడు వారు (మరెవ్వరు గారు. అప్పయ్య) వట్టికాగితము తీసుకువచ్చినపుడు సంతకము చేసినాడా లేదా యనికూడా జూడలేదు. మరియొకరు వాగ్వాదమున కారంభించినారు. వాదమవసరము లేదు. ఇదిగో మహజరు. చదివి చేసితే చెయ్యండి లేదా మానవచ్చు నన్నాను. అక్కడికిని వారు వాదము మానకపోయేటప్పటికి నేను ప్రతివాద మాడినాను. అందున్నవారు కొందరొక పక్షము మరి కొందరు మరొక పక్షమైనారు. ఇంతకన్న నెక్కువతంటాలు పడలేదు.

ఇక నేసంతకము చేయుటలో గలిగిన రండాగర్భమేమో శెలవియ్యవలెను. నా మతము తమకు విశదమే. సలక్షణముగాగాని తెలుగు వ్రాయగూడదని లక్షణ విరుద్ధమైనది బాలురు చదువగూడదని. లక్షణమన్ననేమో మొదలగు సంగతులు చర్చింపవలసిన చోటిదికాదు. మహజరు కోరినదియు నదియే ఈ కోరికల నిలబెట్టుటకు మహజరులో వ్రాసిన కొన్ని సంగతులు నాకు సహేతుకముగ గాన్పింపలేదు. అవి అబద్ధములనికూడ చెప్పగలను. అట్లని మహజరంతయు నిరసించుట న్యాయమా. ఇంతకు నాసంతకముకన్న బహిరంగముగా నా యభిప్రాయములను వెల్లడి చేయుటకు యత్నించి మెడ్రాసు మెయిలుకు వ్రాసినానుకాదా? ఆలాగు వ్రాసిన యుపన్యాసమందలి వాదములు మహజరువాదములును గొట్టివేయునా వేయవా? ఇంతకన్న ధారాళమైన ప్రవర్తన మరి యెవ్వరియందైనగలదా? నాసంతకమును ఉపన్యాసమును దగ్గరబెట్టి విమర్శించి మరి నన్ను నిందించవలెను. నేను సంతకముచేసినా నన్నమాత్రముచే మీకు గోపము వచ్చినది. ఇంత పరమతాసహ

నము మీకుగూడదు. మీకు జడిసియే అప్పయ్య సంతకము చేసినాడు కాదు. నేనుకూడ నాలాగు చేయుమన్నారా. ఆలాగు చేసితినేని మీకు నాయందు గౌరవముండునని యెంచవచ్చునా? లౌక్యుడవందురు కాబోలు. కాని సత్యవాది యనియునందురా? మీ జవాబు చూచుకొని నా సంతకము వితుడ్రా చేసుకోను.

మీరు మద్రాసులో బోడిచేపోడుపుకై యెదురు చూచుచున్నాను. రామయ్యను రెండు సంగతులలో గెల్చుకొందురు. కాని మెమోరియల్‌లోని విజ్ఞప్తి న్యాయము కాదని వాదించితేని యాంధ్రప్రపంచమంతయు మీతోకకు తాటాకులు కట్టక మానదు. ఒక్కశుభ (మీకశుభ) వార్త తమకు విన్నవించవలసి యున్నది. శ్రీశ్రీశ్రీ విజయనగర మహారాజావారు మా పక్షము!!! ఇప్పుడు మాబల మొక్కమారు తలచుకొండి.

శ్రీనివాసయ్యంగారికి నా నమస్కారములు మనవిచేసి నా యుత్తరములకు జవాబియ్యనందుకు నాకు గలిగిన కోపము వారు కార్యసిద్ధిచేసినగాని తీరదని చెప్పవలెను. మీ యుభయుల సహాయముచేతను ఆ పని నెరవేరునని యాశపడుచున్నాను.

చిత్తగించవలెను.

* * *

కొండా వెంకటప్పయ్యపంతులుగారు

గుంటూరు
3 నవంబరు 14

ప్రియ మిత్రమా,

మీలేఖకు కొంచెం ఆలస్యంగా సమాధానమిస్తున్నందుకు మన్నింపకోరుతున్నాను. ది ఇంటర్మీడియటు తెలుగు కాంపో

జిషన్ కమిటీ రిపోర్టు, ది తెలుగు కాంపోజిషన్ కాంట్రవర్సీ రెండూ నాకు అందాయి. మీరు కోరినట్లుగా, నేను వాటిని 'ఇండియన్ క్లబ్'కు అందచేస్తాను.

ఇక్కడ 'ఇండియన్ క్లబ్' కాక దియంగ్మెన్స్ లైబ్రరీ అసోసియేషను అనే పేరిట ఇంకొకసంఘం వుంది. ఈ సంఘానికి నగరంలోని యువకులు, ముఖ్యంగా జూనియరు లాయర్లు హాజరవుతూవుంటారు. మీకు ఇంకొకసెట్టు పుస్తకాలను పంపించడానికి అవకాశంవుంటే, అలా పంపించడం వృథాకాదనుకుంటే తప్పక నాకుఅందచేయండి. వాటిని నేను దియంగ్మెన్స్ లైబ్రరీ అసోసియేషనుకు ఇస్తాను.

## వేదము వేంకటరాయశాస్త్రిగారు

నెల్లూరు, మూలపేట
17-1-15

ప్రియమైన అయ్యా,

పన్నెండవతేదీన మీరు దయతో వ్రాసిన ఉత్తరము అందినది. మీ ఆరోగ్యం సరిగాలేనందుకు నాకెంతో విచారముగా వున్నది. సైనిక అనుభవము వ్యసనములలో చేర్చదగినదని మీరు అభిప్రాయపడుతున్నారు. సైన్యముకావించే మహోఘనకార్యము నరమృగయా కనుక, అది మీఅభిప్రాయమును దృఢపరుస్తున్నది.

ఎపుడు పిలిచినా, హాజరయే నవుకర్లు మీకు అనేకులు. అలాంటపుడు కాఫీ * మీరే ఎందుకు స్వయంగా కాచుకుంటు

* కాఫీ కాచుకుంటున్నపుడు, మరుగునీళ్లు పడుటవల్ల, మహాకవి చేతులు బొబ్బలెక్కినవి. అప్పుడాయనకు జ్వరం.

[చూ: మహాకవి డైరీలు. పుట 253]

న్నారో నాకర్థము కావడములేదు. భారమైన పనులతరవాత, కొంతరిలీఫ్ కోసము మీరే యిలాంటిపనులు కల్పించుకుంటారు కాబోలును. నా కాఫీ నేనే కాచుకుంటానంటే దానికి కారణం వున్నది. నాకు నవుకర్లులేరు; ఇతర్లుచేస్తే రుచివుండదు. ఈసరికి మీచేయి నయమయిందనుకుంటాను.

ప్రాచీన పద్యకావ్యములతోపాటు, సమకాలీన పద్య కావ్యములను, బి. ఏ. విద్యార్థులకు పాఠ్యగ్రంథములుగా నిర్ణ యించవలెనని మీ అభిమతము కాని, యిప్పట్టున, మీకొక విష యము చెప్పవలసివస్తున్నందుకు విచారిస్తున్నాను. ఇప్పటి కవి త్వము చాలమటుకు వట్టి ఊక. దీనిని క్లాసికల్ కవిత్వముగా, పరిగణించడానికి వీలులేదు. దీనికట్టి అర్హత పూజ్యము. వ్యాకర ణము దుష్టము; ఛందస్సు లోపభూయిష్టము; నాట్యశాస్త్ర మర్యాదలు బొత్తిగా శూన్యము. ఔచిత్యము, వివేకజ్ఞానము మృగ్యము; ఇవీ, నేటికాలపు రచనలలో కనబడుతున్న ప్రధాన లక్షణములు నేను వ్రాసిన ప్రతాపరుద్రీయము నాటకములో విద్యానాథుని రంగము, ఈదోషములు లేనిదానినిగా భావించి దానిని పాఠ్యభాగముగా నిర్ణయించినట్లయితే, మీరు నాపట్ల చూపుతున్న గౌరవమునకు కృతజ్ఞతాభివందనములు. దీనికి మారుగా ఇంకొక రంగమును పాఠ్యభాగముగా మంచిదని నేను పేర్కొనజాలను.

ఆముక్తమాల్యద వ్యాఖ్యానము ఎంతవరకు కొనసాగిన దని మీరు అడిగినందుకు సంతోషము. నా రచనావ్యాసంగమును గురించి మీరు భోగట్టా చేసినందుకు కృతజ్ఞుడను; తృతీయా శ్వాసము పూర్తిచేసిన పిదప నాకు అనేక కష్టములు తటస్థించి నవి. కెరటములవలె వచ్చి మీదపడుతున్న కష్టములకు తట్టుకొన

లేక చెన్నపట్టణము వదలవలసివచ్చినది. ఆ కష్టములు నన్ను చెన్నపట్టణమునుండి తరుముటయేకాదు; ఈ లోకమునుండి నన్ను తరుమకొట్ట ప్రయత్నించినవి. వీటికితోడు శరీరమున అస్వస్థత; ఏదో ఒక బాధతో అయిదు నెలలపాటు శ్రమ పడుతూనే వుంటిని.

ఇటీవల వావిళ్ళవారు ప్రచురించిన ఆముక్తమాల్యదను గురించి మీరు వ్రేర్కొన్నారు. దానిని నేను చూడలేదు. ప్రతి ఒకటి సంపాదించి చూస్తాను. ఆముక్తమాల్యద కృతికర్త ఎవరో నిర్ధారణ చేయడానికి, శాసనములను యితర పత్రములను పరిశీలిస్తున్నాను. కాని ఇంతవరకు తగిన సమాచారము లభించ లేదు. అంతవరకు ఆముక్తమాల్యదను శ్రీకృష్ణదేవరాయలు రచించినాడనే సిద్ధాంతముపట్ల నాకు నమ్మకము లేదు.

నిజమైన సాహిత్య వ్యాసంగమును హర్షించగలవారు మన దేశములో బహుకొద్ది. ఆ కొద్దిమందిలో మీరుఒకరు. అలాంటిమీరు, శృంగార నైషధముపై నా వ్యాఖ్యానము ఎలా వున్నదో, వ్రాసినారు కాదు. అనర్హులు వేయిమంది పొగడినా తెగడినా, ప్రయోజనమేమిటి? మీరు మీ అభిప్రాయముగా నాలుగు పంక్తులు వ్రాయనందుకు, నా మనసు క్షోభపడుతున్న దంటే, మీరు ఆశ్చర్యపడనక్కరలేదు. శృంగార నైషధము వ్యాఖ్యానముమీద మైసూరునుండి శ్రీ రామలింగారెడ్డిగారు దయతోపంపిన అభిప్రాయమును, మీ పరిశీలనార్థము ఇందులో జతపరచివుంచాను. ఒక విషయమును, గౌరవనీయుడైన స్నేహితునికి తెలియచేయడము తప్ప, రెడ్డిగారి అభిప్రాయ మును మీకు పంపడములో నాకు వేరే ఉద్దేశము లేదు.

మెట్రిక్కు, ఇంటర్మీడియట్కు, బి. ఏ లకు సంబంధించిన 'బోర్డు ఆఫ్ ఎగ్జామినర్స్' నుండి నన్ను తప్పించినట్లు మీరెరుగుదురు. మీరేకనక నాయెడల దయచూపి వుండినట్లయితే, యిది సంభవించెడిది కాదేమో అనుకుంటాను.

*　　　　*　　　　*

# ఆంధ్రసాహిత్యపరిషత్తు *

"ఆంధ్రసాహిత్యపరిష్కార్య నిర్వాహకసభ 1915 సంవత్సరము, ఫిబ్రవరినెల 20 వ తేదీ, శనివారమునాడు ఉదయము 8 గంటలకు బెజవాడ సోషల్ క్లబ్బులో సమావేశమగును,"

నిద్రబోతున్నానా! అనుకున్నాను. కళ్లునులుపుకొని, తిరిగి నిదానించిచూశాను. కార్డుమీద అచ్చుఅక్షరాలు స్పష్టంగా కనబడ్డాయి. షేక్స్పియర్ అన్నట్లు కలలైనా యెరగని కార్యాలు యెన్నోవున్నాయి, అందులో ఇదివొకటి కావచ్చును, అనుకున్నాను.

అయితే చెన్నపట్నం రాజధానిలో జరుగుతూవచ్చిన సభ రెండువందలయాభయి మైళ్ళు ఉత్తరానికి యెలా డేకిరిం

* 1915 లో మొదట చెన్నపట్టంలో జరపాలనుకున్న సమావేశాన్ని వ్యావహారికభాషావాదులు హాజరుకాకుండా, వ్యవధిలేకుండా హఠాత్తుగా ఆంధ్రసాహిత్యపరిషత్తువారు బెజవాడకు మార్చివేశారు. ఇది అప్పారావుగారు తెలుగున వ్రాసిన వ్యాసం. ముద్రితము.

అంతకుముందు జరిగిన తణుకు సభలో వ్యావహారికభాషా తీర్మానాన్ని గిడుగు రామమూర్తి పంతులుగారుప పాదించారు. కాని అది నెగ్గలేదు. ఇటువంటి ఉపద్రవాలు ఇకముందు కలుగకుండా, వ్యావహారిక భాషావాదులు తమ పరిషత్తులో సభ్యులుగా చేరకుండావుండేలాగ పరిషత్తు పెద్దలు కట్టుదిట్టాలు చేసుకున్నారు.

దని శంకపొడమింది. కారణం వినా, కార్యంవుండబోదు. ఆలో చించిన కొద్దీ కారణాలు శరపరంపరగా స్ఫురించాయి.

ఆంధ్రదేశానికి ఒకప్పుడు బెజవాడ రాజధానిగా వుండేది. సార్వభౌముడైన కృష్ణరాయలు పూర్వ దిగ్విజయ యాత్రకు విచ్చేస్తూ బెజవాడలో కొన్ని దినములువున్నాడు. హుయంత్ సాంగ్ అనే చైనాదేశపు బౌద్ధయాత్రికుడు బెజవాడలో కొన్ని దినములుగడిపాడు. యుబోనెటొపర్ సెయ్, అనే పరాసుయాత్రికుడుకూడా బెజవాడలో కాలుఊనాడు. పరిషత్తుకు కొంతకాలం సెక్రటరీగా వుండిన మ. రా. రా. హనుమంతరావు పంతులు గారు బెజవాడలో యిప్పుడు చెయిరుమానుగా వున్నారు.

యింకా కారణాలు కావాలా? బెజవాడదగ్గర యెన్నో రైళ్ళు కలుస్తాయి. బెజవాడ, చెన్నపట్ణానికి విజయనగరానికి మధ్యనుంది. ఇంద్రకీలాద్రిమీద అర్జునుడు తపస్సుచేశాడు. యుద్ధమల్లుడి శాసనం.

"ఆగు! ఆగు! యిన్ని కారణాలు చెబుతున్నావుగాని, ఆంధ్రసాహిత్యపరిషత్తుకూ, యీ కారణాలకూ సంబంధమేమిటి? ఆంధ్రవాఙ్మయానికి, చక్రవర్తి, తిక్కన సోమయాజిగదా? అట్టి తిక్కయజ్వ, ఉత్తరరామాయణంలో 'సారకవితాభిరాము గుంటూరు విభుని మంత్రి భాస్కరు మత్పితామహుని దలతు' అన్నాడు. అంతటివాడితాత పాలించిన గుంటూరులోనే, యేల సభ జరగకూడదూ?' అని ఒక నవనాగరికుడు అన్నాడు.

"చేసినదానికల్లా అడ్డుచెప్పడమేనా తెలివికి చిహ్నా? బెజవాడలోనో, ఆకాశంమీదో, యెక్కడో ఒకచోట సభచేస్తున్నారని సంతోషించరాదా? ఇదీచేయకపోతే మీరు చేసేదెమిటి?

ఇన్నాళ్లూ సభచేయకపోతే, మీరేంచేయగలిగారు?" అని సమాధానం చెప్పాను.

మోడ్రన్ పిల్లకాయలకు పెద్దలయెడల ప్రపత్తి తక్కువ. "మహాజనో యేన గతస్సపంథాః"అని వారి అడుగుల్లో అడుగు వేసి నడవరు. ఎంతటివార్నీ తప్పులు పడతారు; వాళ్ళశంకలకు సమాధానంచెప్పడం యెంతటివాడికైనా, ఒకప్పుడు కష్టసాధ్యమవుతుంది. మరివొకబుద్ధిమంతుడు అన్నాడు. బెజవాడలో సభచేయడం పద్ధతికాదట. ఏమి అనాలోచితమయినమాట! కాన్‌స్టిట్యూషనులో విద్వాంసులైన సెక్రటరీలు చేసేవని యేమూలనైనా యిమడకపోతుందా?

"సరేనయ్యా! ఇమిడిందనుకుందాం గాని హాటాత్తుగా బెజవాడకు డేకిరించినవారు రేపు ఉత్తరధ్రువానికి డేకిరిస్తారు. చెన్నపట్నంలో సభచేస్తే అక్కడ నివసించి ఉన్న మెంబర్లు మీటింగుకు రావడానికి వీలుపుంటుంది. అక్కడైన మీటింగులకే కొంతమంది అక్కడివారు రారు. ఆలాటి స్థితిలో వ్యయప్రయాసములమీద, బెజవాడ మీటింగుకు వెళ్ళబోతారా? ఆ చెన్నపట్నంలోనైనా పై జిల్లాల పెద్దమనుష్యులు వచ్చే రోజుల్లో అనగా లెజిస్లేటివ్ కౌన్సిలు మీటింగు మొదలయిన మీటింగుల కాలమునకు సామీప్యంలో పరిషత్కార్య నిర్వాహకసభ చేస్తే నలుగురు రావడానికి అవకాశం కలుగుతుంది. అదంతా మాని తోచినపుడు తోచినచోట, ఆవాయిదాస్తుగా సభలు చేయడమేమిటయ్యా?" అని ఉపన్యసించాడు, ఇంకొక బుద్ధిమంతుడు.

కొంచెం ఆలోచించినపైె, బలవత్తరమైన సమాధానం తోచింది. యెందుకు తోచదూ? మాట్లాడ్డానికి పనిచెయ్యడానికి

చాలా దూరం. పదిమంది చేరితే మాటలు మెండవుతాయి. పన్లు పాడౌతాయి. కోడొకడకు తీస్తే కొమ్మొకడు తీస్తాడు. ఒకడౌనంటే ఒకడు కాదంటాడు. అందులో హిందూదేశానికి పార్లమెంటరీ గవర్నమెంటు యెంతమాత్రం పనికిరాదు! గనుక పనులన్నవి ఒకరిద్దరిమీదనే జరుగవలసినది. కడం మెంబర్లందరూ హాయిగా పడుకొని నిద్రపోవచ్చును! పనితో వారికేమీ పనిలేదు.

కారణం లేకనేనా, అలా అనుకున్నారు? ఆంధ్ర మహా జనసభకు అంటకుండా సాహిత్య పరిషత్తులు యెలా కాపాడుకు వస్తున్నారో! ఈ జ్ఞానం అప్పుడు నాకులేక, తొలిసంవత్సరం ఆంధ్రసాహిత్య పరిషత్తుయొక్క సాంవత్సరిక సభ ఆంధ్రమహా జనసభతోపాటు బాపట్లలో జరగవలసిందని, యీ సంవత్సరం విశాఖపట్నంలో జరగవలసిందని నొక్కి చెప్పాను. నామాటగా నా మిత్రులు విని ఆలా చేసినట్టంటే ఆంధ్రమహాజనసభలో వుండే నవదేశాభిమానుల ధాటికి సాహిత్య పరిషత్తు మూడు ముక్కలయిపోయి యుండదా?

ఐతే నిన్నగాక మొన్ననే ఆంధ్ర మహాజనసభ కూడినది గదా, ఆ స్థలంలోనే పరిషత్కార్య నిర్వాహకసభ యేలా చేయతలచేరు?

ఫర్వాలేదు. కృష్ణవరదలకి దాని వాసనయావత్తూ కొట్టుకుపోయింది!

# మ హా క వి లే ఖ లు

ఎక్కహిల్ హౌసు
ఉదకమండలం
22 మే 1905

ప్రియమైన అయ్యా,

మీరు పన్నెండవ తేదీన వ్రాసిన జాబు అందింది. నేను ఇక్కడికి పదకొండవ తారీఖున వచ్చాను. కొన్నేళ్ళక్రితం జయపూరు మహారాజావారు నాకొక ఉత్తరం వ్రాస్తూ జయపూరు చరిత్రకు సంబంధించిన వివరాలు నావద్ద వుంటే తెలియజేయవలసినదని కోరారు. అప్పటినుంచి నేను జయపూరు చరిత్రను పరిశీలిస్తున్నాను. నా పరిశోధనలవల్ల అనేక విషయాలు నాకు తేటపడినవి. కొన్నిటిని తెలియజేస్తాను. అవి మహారాజా ఆమోదించినట్లయితే, అలాగే; మీరన్నట్లుగా ఒకవ్యాసం వ్రాస్తాను. (అ) సంగమువలస రాజా తన కరపత్రంలో పేర్కొన్న సంగతి నిజంకాదు. జయపూరువంశ మూలపురుషుడు కాశ్మీరునుంచి రాలేదు. అది అబద్ధం. ఆ కాలంలో కాశ్మీరు పరిపాలకులు వేరు. శంకర వంశీకులు ఎన్నడూ కాశ్మీరును పరిపాలించలేదు. (ఆ) కటకము రాజులకు జయపురమువారు సామంతులని, ప్రభుత్వము అచ్చువేసిన జయపూరు పత్రములలో వున్నది. అది నిజమగుటకు అవకాశాలు వున్నవి. (ఇ) శంకరుడు ఆదిపురుషుడు గాగలిగిన వంశములు రెండే రెండు. కదంబులు; పల్లవులు. శంకరుని కనుబొమలనుండి కదంబులు జన్మించినారని కథ. వారిగోత్రము మానవ్యస జయపురపు వంశము పల్లవ వంశమునకు చెందినదని చెప్పవచ్చును. అందుకు అనేక ఆధారములు కనబడుతున్నవి.

పల్లవులది భారద్వాజస గోత్రము. వివాహ సంబంధములవల్ల పల్లవులకు చాళుక్యులకు బాంధవ్యము కలిగినది. ఈ సిద్ధాంతము రాజాగారికి అంగీకార మయితే, నేను వ్యాసము వ్రాస్తాను. ప్రభుత్వ పరిశోధక కార్యాలయము ఒకటి ఇక్కడవుంది ప్రాచీన శాసనములు ఇక్కడ చూడవచ్చును. రాజావారి సోదరునికి నేను ఇదివరకు నా యీ సిద్ధాంతాన్ని విపులముగా బోధపరిచినాను. ఆయన దీనిని అంగీకరించినాడు. ఒరియా భాషలో రాజాగారు ఒక చరిత్ర గ్రంథమును వ్రాసినట్లు తెలిసింది. అందులోని ముఖ్య విషయాలు తెలుగున అనువదించి నాకు పంపగలరా? అవి కొంతవరకు ఉపయోగ పడవచ్చునేమో!

* * *

ప్రియమైన అయ్యా, *

మీరు ఒకటవ తేదీన ప్రచురించిన నా లేఖలో 'నన్నయ భట్టు' అనే పదము 'రామయ్యభట్టు' అని పొరపాటున అచ్చు పడింది. బట్టరువర్తు నెల్లూరు శాసనముల సంపుటములలోని ఈ దిగున ఉదాహరించిన వాటిని, శ్రీ ప్రకాశరావుగారు చూడ వలెనని కోరుతున్నాను.

నెల్లూరు శాసనములు; రెండవ సంపుటము.

| పుట | ఊరు | సంఖ్య |
|---|---|---|
| 544 | కందుకూరు | 31; 32 |
| 606 | ,, | 67 |
| 609 | ,, | 69 |

* 1911 ఫిబ్రవరి 6 తేదీన విజయనగరం నుంచి హిందూ దిన పత్రికకు వ్రాసిన సంపాదక లేఖ. శీర్షిక: "అపరిశోధిక శాసనము."

| | | |
|---|---|---|
| 676 | కనిగిరి | 25 |
| 896 | ఒంగోలు | 3 |
| 966 | ,, | 39 |
| 967 | ,, | 40 |
| | మూడవ సంపుటము | |
| 1151 | పొదిలి | 1 |
| 1152 | ,, | 2 |
| 1201 | ,, | 38 |

ఈ శాసనములన్నీ అతి ముఖ్యమైనవి. నన్నయ కాలం కంటె ప్రాచీనమైనవి. నాటి తెలుగు కావ్యభాషాచరిత్రమును అవగాహన చేసుకుందుకు యివి తోడ్పడతాయి, బట్టరు వర్తు సంపుటాలలోని శాసనముల ఫొటోలు సంతృప్తికరంగా లేవు. ఆ శాసనాలకు తిరిగి ఫొటోలను ఎత్తి గవర్నమెంటు శాసన పరిశోధకుడు వ్యాఖ్యానంతోనో, వ్యాఖ్యానంలేకనో చక్కగా ఎపిగ్రాఫికా ఇండికాలో అచ్చువేయవలసి వుంటుంది.

ఉత్సాహవంతులైన యువపరిశోధకులను గురించి శ్రీ కృష్ణశాస్త్రిగారు కొన్ని అభిప్రాయాలను వెలిబుచ్చారు. అవి బట్టరువర్తు శాసనసంపుటములకు సైతం వర్తిస్తాయి. అయితే అవి విలువైనవి కావని నా అభిప్రాయం కాదు. పైగా ఆసంపుటముల వల్ల ఎంతో ప్రయోజనం వుందని నా ఉద్దేశం. నమ్రత వల్ల తన పీఠికలో బట్టరువర్తు లింత తక్కువచేసి చెప్పుకొన్నప్పటికీ, అవి అంతకంటె ఉపయోగకరం. పదమూడు శతాబ్దాల భాషాస్థితి, లిపి స్వభావం, దక్షిణదేశపు అనేకరాజుల చరిత్ర వాటివల్ల మనకు కొంత తెలుస్తుంది. శాసనాల నకళ్ళు

అచ్చులో యథాతథంగా అసలు శాసనాలవలె వుంటాయని మనం ఆశించలేం. వాటిని ప్రచురించేటపుడు కొన్ని పొరపాట్లు జరగవచ్చును. కనక పరిశోధకులు ముఖ్యమైన నిర్ణయాలు చేయవలసివచ్చినపుడు అసలు శాసనాలపై ఆధారపడవలసి వస్తుంది. రెండవ అమ్మరాజు మల్లియపూండి శాసనాన్ని డాక్టరు హుల్ట్జ్ పునఃపరిశీలించి ప్రచురించాడు. బట్టుగువర్రు సంపుటాలకు యివ్వదగిన ప్రాముఖ్యముకంటె అధిక ప్రాముఖ్య మివ్వకూడదు.

ప్రభుత్వ ఉత్తరువును నేను చూడలేదు. కాని దాన్ని గురించి మీ పత్రికలో శ్రీ యం. కె. నారాయణ అయ్యంగారు వ్రాసిన విమర్శనను చదివాను, శ్రీ వెంకయ్య కృష్ణశాస్త్రి గారలపట్ల ఆయన వెల్లడించిన అభిప్రాయాలు ఎంతమాత్రం సబబుగా లేవు. ప్రభుత్వ శాఖలో ఉద్యోగులుగా పనిచేస్తున్న శాసన పరిశోధకులకంటె, ఉత్సాహవంతులైన యువపరిశోధకు లకు తెలుగో తమిళమో ఎక్కువ రావచ్చును కాని ఒక సంగతి మటుకు నిజం. పరిశోధనమే జీవిత ధ్యేయముగా అనేక సంవత్స రాల అనుభవంతో బాధ్యత కలిగి పండితుల సంపాదకత్వాన ప్రచురితమయే శాసనపు ప్రతులు, ఉత్సాహవంతులైన యువ పరిశోధకుల ప్రచురణలకన్న ఎక్కువ ప్రామాణికం.

మహాపండితుల సైతం పొరపాట్లు చేయకపోలేదు. చరి త్రతో అనుసంధించి చెప్పడానికి తగినన్ని ఆధారాలు దొరక నపుడు, శోధించవలసిన అనేక విషయాలు యింకా మిగిలి వుంటున్నపుడు, పరిశోధనా రంగంలో పొరపాట్లు రాకతప్పవు. దొరికిన శాసనాలను ఆధారాలనుబట్టి అప్పటికొక విషయం ప్రామాణికం కావచ్చును. కాని అందుకు భిన్నమైన రుజువులు లభించినపుడు వెనుకటి విషయం అప్రమాణిక మౌతుంది. నూతన

ఆధారములనుబట్టి నిశ్చయ జ్ఞానాన్ని అన్వయించుకో వలసి వుంటుంది. భారత దేశములో పరిశోధనా రంగమున యిప్పటి పరిస్థితులలో యిట్టివి తప్పవు, మనం యింకా అనేక ప్రధాన విషయాలను పరిశోధించవలసి వుంది. కొన్ని ప్రాచీన తమిళ శబ్దములను శ్రీ వెంకయ్యగారు తప్పుగా అనువదించి వుండ వచ్చును, అందులో వైపరీత్యం లేదు. బహు భాషారాష్ట్రములో శాసన పరిశోధకుడు అనేక చిక్కులు ఎదుర్కొనవలసి వస్తుంది. తమిళ తెలుగుభాషలు ప్రాచీనమైనవి. ఆ భాషల ప్రాచీనకావ్య భాషా పదములు సులభద్యోతకములు కావు; ద్రవిడ భాషలను శాస్త్రీయ పద్ధతులపై పరిశీలించి వాటి తత్వమును నిరూపిం చడం అవసరం. ఇది యూరోపియనులతో ఆరంభమయింది. అయినా నేటికీ మన దేశీయుల కృషి అంతంతమాత్రం భాషా పరిశోధనా రంగంలో పీటస్థానం మరుగున పడిపోయింది. దేశీ యుల దృష్టి వీటిపైకి అంతగా మళ్ళడంలేదు. ప్రాచీన భాషను మాండలిక భాషలను పరిశీలించడం ఎంత ఉపయోగమో తెలుగు రచయితలు గుర్తించడం లేదు. దురదృష్టవశాత్తు తెలు గున ఈ కృషికి, సీ పి. బ్రౌను మొదటివాడు; ఆఖరువాడు. తమిళమున అలాగ కాదనుకుంటాను.

శ్రీ వెంకయ్య కృష్ణశాస్త్రిగారలు శాసన పరిశోధన విషయంలో అవసరం వచ్చినపుడు తెలుగు పండితుల సహాయం తీసుకునేవారు. ఎవరు ఏ సలహాలనిచ్చినా, వాటిని శ్రద్ధగా పరి శీలించేవారు. ఇది నా అనుభవం. కొన్ని శబ్దముల పట్ల పొర పాటు పడినంతమాత్రం చేత, వారు శాసనపరిశోధకులుగా అనర్హులని ఎలా భావించగలమో నాకు అర్థం కావడంలేదు. అంతమాత్రాన వారు నిష్ణాతులు కాకపోరు. నిఘంటువులను

తలలో యిముద్పుకొనడము కంటె, అనేక ఉన్నత అర్హతలు ఒకనిని శాసన పరిశోధకునిగా తయారు చేస్తాయి. మన శాసనములను పరిశోధించిన యూరోపియనులకు మన భాషలలో పాండిత్యము తక్కువ. తగుపాటి భాషా పరిజ్ఞానంతో, వ్యాకరణ పరిచయంతో, వారు, మన ప్రాచీన శాసనాలను పరిశోధించి అత్యద్భుతమైన సేవ చేశారు.

శాసన పరిశోధకశాఖవారు కావించిన కృషిని అంచనా వేస్తూ శ్రీ నారాయణస్వామి అయ్యంగారు వ్రాసిన వాక్యాలు చదివినపుడు నాకే కాదు, ఎవరికైనా నవ్వు వస్తుంది. డాక్టరు హుల్ట్జ్, ఆయన సహాయకులు కావించిన కృషి తక్కువది కాదు. నిజంగా వారికి మనం ఋణపడివున్నాం. పరిశోధకశాఖలో వారు శాస్త్రీయపద్ధతులను ప్రవేశపెట్టారు. ప్రామాణికమగు స్థాయిని నెలకొల్పారు. దక్షిణ భారతదేశపు ప్రాచీన చరిత్ర పరిశోధనతో పరిచయమున్న వారికి ఈ విషయం తెలుసును. ఊటీలో నేనున్నప్పుడల్లా, ప్రభుత్వశాఖ కావిస్తున్న కృషిని, పళ్ళకు తరబడి పరిశీలించాను. కార్యాలయంలో పనిచేస్తున్న వారు సమర్థులు అంతకంటె హెచ్చు ఉత్సాహంతో పట్టుదలతో పనిచేస్తున్న వారిని నేను చూడలేదు. శ్రీ నారాయణస్వామి అయ్యంగారు కుశాగ్రబుద్ధి కలవారు, పండితులు. సందేహంలేదు. కనక. శాసనపరిశోధన మనేది ఎంత కష్టమైన పనో, శాసనపరిశోధక రిపోర్టులను తయారుచేసి ముద్రించి ఉన్నత స్థాయిని సాధించడం ఎంతశ్రమో, పరిశోధన ఎంత మేధాశక్తిని హరిస్తుందో శ్రీ అయ్యంగారు ఊహించుకోగలరు. బహుశా తమిళ శాసనములను పరిశోధించడము యింతకంటె తేలిక కావచ్చును. కాని తెలుగు శాసనముల పరిశోధనము వేరు.

అతి కష్టమైన తెలుగు శాసనములను శ్రీకృష్ణశాస్త్రి వెంకయ్య
గారలు పరిశోధించారు. కొన్ని సంవత్సరాలక్రితం, యుద్ధమల్లుని
బెజవాడ శాసనాన్ని గొప్ప పండితులనుకునే అనేకులు కొన్ని
నెలలపాటు పరిశీలించారు. కాని దాన్ని వారు పోల్చుకోలేక
పోయారు. చివరకు శ్రీకృష్ణశాస్త్రిగారు ఆ శాసనము ఛందో
బద్ధముగా వుందని, దానిని దిగువనుండి మీదకు చదువవలెనని
పోలికపట్టి నిర్ధారణచేశారు.

శ్రీ నారాయణస్వామి అయ్యంగారు తన విమర్శన
ములో మార్షల్ వాక్యాలను కొన్నిటిని ఉదహరించారు. అవి
ఈ రాష్ట్రానికి వర్తించవు. శ్రీ వెంకయ్యగారు ప్రతిసంవత్సరం
ఆసక్తికరమగు విపులమైన శాసన పరిశోధన రిపోర్టులను వెలువ
రిస్తున్నపుడు మార్షల్ రిమార్కులతో అసలుపని లేదు. ఎపిగ్రా
ఫిస్టుగారి ఆఫీసులో రికార్డులను ఎవరినీ చూడనీయడం లేదనడం
...వ్యంకాదు. ఏ అర్థములో ఈ మాటను అంటున్నారో నాకు
...రవగాహం. వాటిని అర్హతలువున్న ఏ పరిశోధకుడైనా, పరి
...ంచడానికి అతి సులువుగ అనుమతిని పొందవచ్చును. పరిశో
...నశాఖపట్ల విద్యావంతులు తగిన ఉత్సాహాన్ని కనబరచడం
...దు. దానిని అన్నివిధాల అభివృద్ధి చేయడానికి ప్రభుత్వం
...నకాడుతోంది; ఎక్కువ డబ్బు ఖర్చుచేసి అమూల్యమైన
...చురణలను వెలువరించడానికి జంకుతోంది. ఉత్సాహవంతు
...న యువపరిశోధకులకు అందుబాటులో వుండేటందుకు
...ప్లికేటు కాపీలను శాసనపు నకళ్ళను మద్రాసు మ్యూజియ
...లో పదిలపరచ వలెనని నా సూచన. అందువల్ల విద్యావంతు
...కు ఆసక్తి కలుగవచ్చును. ఇపుడు ఈ రంగములో కృషి
...స్తున్న ఉత్సాహవంతులైన యువపరిశోధకులు తక్కువ. వీరు

చేస్తున్న కృషి పరస్పర సంప్రదింపుల వల్ల సమన్వయం చేసుకోవాలి; యువపరిశోధకులను గురించి శ్రీ కృష్ణశాస్త్రి గారు వెలిబుచ్చిన అభిప్రాయాలు అభ్యంతరకరమైన వని అనుకుందాము. అయినప్పటికీ, ప్రభుత్వ శాఖలో పనిచేస్తున్న శాసన పరిశోధకులు అసమర్ధులని, ఆ శాఖ కావిస్తున్న కృషి అల్పమని మనం అనలేము నాకు తమిళ భాషాజ్ఞానము తక్కువ. అందువల్ల శ్రీ గోపీనాధరావుగారు నిష్ణాతులో కాదో నేను చెప్పలేను. కాని ఈ విషయం శ్రీకృష్ణ శాస్త్రిగారిని అడిగితే, శ్రీ గోపీనాధరావుగారు చాలా తెలివైనవారని, అన్ని విషయములు తెలిసినవారని ఆయన సంతోషముతో అంగీకరిస్తారని నా నమ్మకం.

*    *    *

ఎడ్మిరాల్టి హౌసు
మైలాపూరు
22 నవంబరు 1911

ప్రియమైన స్నేహితుడా,

మీరు నిన్న వ్రాసినలేఖ ఇప్పుడే నాకుఅందింది. ఎవరి కృషిని వారు చెప్పుకోవడం బాగుండదు. బాగుండని పని మీరు నాచేత చేయిస్తున్నారు, సరే. సిండికేటు సభ్యులు నన్ను బాగా ఎరుగుదురు. వారికి నాకృషి ఏమో తెలుసును. కాని ఒక ప్రశ్న : ఒకరి సాహిత్య కృషిని ఎందుకు అడగడం ? ఒకవాక్యం వ్రాయని, ఒక పుస్తకం ప్రచురించని పండితులు మనలో అనేక మంది వున్నారు. సృజనాత్మకశక్తికి, పాండిత్యానికి భేదం చాలావుంది. ఒక కళాశాలలోనో, పాఠశాలలోనో పండితుడుగా

వున్నంత మాత్రాన తానొక కవి ననుకోవడం ఎవరికీ భావ్యం కాదు. ప్రతి పండితుడు తానొక వచన రచయితననో, కవిననో భావించడం మనదేశ దౌర్భాగ్యం; మనదేశంలో పాఠశాలలలోని పండితులు సాధారణంగా అలాగే అనుకుంటున్నారు; పనికి మాలిన పాండిత్యంతో కవిత్వంమీద విరుచుకు పడుతున్నారు.

మీరు అడుగుతున్నారు కనక, నేను చెప్పడం, తప్పని సరి. మీరు కోరిన ప్రకారం ఇందుతోపాటు ఒక 'మెమో' పంపుతున్నాను. అయితే మీరు నా కివ్వదలుచుకున్న దానికి, నాకు వున్న అర్హత నా లెక్చరరు పదవి విజయనగరం మహారాజా వారి కళాశాలలో నేను కొన్ని సంవత్సరాలు లెక్చరరుగా పని చేశాను. ఇంగ్లీషు, హిస్టరీ, సంస్కృతం విద్యార్థులకు బోధించే వాడిని. పిమ్మట విజయనగరం సంస్థానంలో శాసన పరిశోధకునిగా కొంతకాలం కృషిచేశాను. నా కృషిని ప్రభుత్వ శాసన పరిశోధకుడు గుర్తించారు. 1909-10 వ సంవత్సరపు రిపోర్టును ప్రత్యేకంగా చూడండి.

మెమో :

(1) పాతికేళ్ళ క్రితం విజయనగరంలో నేను ఒక పత్రికను నెలకొల్పాను దానికి సంపాదకుడను నేనే. పేరు : 'ప్రకాశిక'

(2) నేను వ్రాసిన తెలుగు నాటకాలు: కన్యాశుల్కము; బిల్హణీయము. బిల్హణీయము ఆంధ్రపత్రిక ఉగాది సంచికలో ప్రచురితమయింది.

(3) నేను వ్రాసిన గేయములు : నీలగిరి పాటలు; ముత్యాలసరములు; డామన్ పితియస్; లవణరాజుకల; కాసులు ఇవి ఆంధ్రభారతిలో ప్రకటితమయాయి.

(4) ఇవి కాక ఆంధ్రభారతిలో మరికొన్ని కథలు ప్రచు రించాను. ఆంధ్రభాషా సాహిత్యములపై కొన్ని వ్యాసాలు, విమర్శనములు, ఆంధ్రపత్రిక, కృష్ణాపత్రిక, కేసరి, శశిలేఖ, ఆంధ్ర ప్రకాశిక మొదలైన పత్రికలలో ప్రకటించాను. తెలుగు కవితా నిర్మాణముపై కృష్ణాపత్రికలో కొన్ని వ్యాసాలు అచ్చుపడ్డవి. ఈమెమోతోపాటు కన్యాశుల్కము నాటకముపై ఇతరుల అభిప్రాయాలను మీకు పంపిస్తున్నాను.

* * *

కోట, విజయనగరం
16 డిసెంబరు 1912

ప్రియమైన శ్రీ గున్నయ్యశాస్త్రి,

నా పోషకురాలు, మహారాజకుమారి కావారు 14వ తేదీన దివంగతులైనట్లు ఇంతకుముందే మీకు తెలిసివుంటుంది. ఆవిడ ఎన్నో పౌరహితకార్యాలను చేశారు. ఆవిడ మరణంతో పౌరులకు తీరనిలోటు కలిగింది. నాకిది ఎన్నటికి తొలగని ఆపద. ఇక నేను రిటైరు కావాలకుంటున్నాను.

మీ ఉత్తరంలో మీరు లేవనెత్తిన చర్చ నాకు ఉత్సాహం కలిగించింది. సాహిత్యమీమాంస నాకెపుడూ సంతృప్తినిస్తుంది అంతకంటె నాకు కావలసినది ఇంకేముంది!

తెలుగు కవిత్వంలో నేను కొత్త 'ఎక్స్పెరిమెంటు' ఆరంభించాను; నా ముత్యాలసరాల రీతిని గమనించినట్లయితే మీకీ విషయం బోధపడుతుంది; నేను తలపెట్టిన మార్పు స్పష్ట పడుతుంది. ముత్యాలసరాల గేయాలను క్రమానుగతంగా మీరు పరిశీలించినట్లయితే, వాటి శబ్దవిన్యాసంలో భేదం కన

బడకపోదు. నేను నా మొదటిగేయాలలో సాధ్యమైనన్ని వాడుక మాటలను, గ్రాంధికవ్యాకరణ సూత్రాలకు లేదా ప్రాచీన కవుల పద్ధతులకు ఒదగని శబ్దాలను. ప్రయోగించాను. పూర్ణమ్మలో వాడుకపదాల కంటె గ్రాంధిక వ్యాకరణసూత్రాలకు సరిపడని శబ్దాలు ఎక్కువ; ఇవి 'కన్యక' లో మరీ హెచ్చు.

ఛందోపద్ధతినిబట్టి శబ్దాల అమరిక ఏర్పడుతుంది. ఛందోరీతుల ఇమిడికవల్ల ఒక్కొకపుడు శబ్దాలు కొద్దికొద్దిగా మారడం కద్దు. మనతెలుగు భాషలో ఈమార్పు యూరోపియను భాషల కంటె అధికం. బెంగాలీ కవులు సులభమైన ఛందో రీతులను స్వీకరిస్తారు. అయినా పదములను పొడిగించి వాడుతూవుంటారు. వాడుకలోవున్న బెంగాలీ రూపములు చిన్నవైనా, వాటిని అలాగున కాక, వాటి సంస్కృత రూపములను వున్నవి వున్నట్లుగా ప్రయోగిస్తారు. ఉచ్చారణ రహిత 'e' పదాంత శబ్ద ప్రయోగములో ఫ్రెంచి కవులు ఇట్టి స్వాతంత్ర్యాన్నే అవలంబిస్తారు

వాడుకలో నశించిన ప్రాచీనరూపాలు వచనంలోకంటె పద్యాలలో అధికసంఖ్యాకంగా ప్రయుక్తమౌతూ వుంటాయి. అందుకు పద్యరీతి ఒప్పుకుంటుంది. ఇప్పటిదాకా తెలుగు పద్య రచన వ్యవహారమున నశించిన పాత పదజాలముతో కొనసాగుతూ వస్తోంది. అందువల్ల మామూలు వాడుక మాటలకు కవితలో అర్థస్ఫూర్తి కలిగే యోగ్యత పట్టడంలేదు. ఇక మనం నూతన కావ్యశైలిని అనుసరించాలి. ఒక పదాన్ని కావ్యంలో ప్రయోగిస్తున్నపుడు దానికొక వింత అర్థం వస్తుంది. పదముల జంటలను వాడడంవల్ల ఒక వినూత్న భావస్ఫూర్తి కలుగుతుంది.

ఇలాంటి కవితా స్ఫూర్తిని వాడుక పదాలకు, మనం కావ్యాలలో కల్పించవలసి వుంటుంది,

ఈ మధ్యనే, ఆంధ్రభారతికి నేనొక మూడు చరణాల గేయాన్ని పంపించాను. అందులో పాతశబ్దాలు లేవు. వ్యావహారిక భాషాపదాలను సులువుగ యథేచ్ఛగ ఇముడ్చుకునే ఛందస్సులను మనం సృష్టించుకోవాలి. నేను అనుసరించిన ఛందోరీతులలో, అనుస్వారాంతనామ పదములు, చక్కగా ఇముడుతాయి.

నా ముత్యాలసరముల గేయములను క్రమానుగతంగా మీరు పరిశీలించినట్లయితే, ఒకదానిలోకంటె ఇంకొకదానిలో నేను సాధించిన అభివృద్ధి మీకు స్పష్టపడుతుంది. మొదటిదానిలో కంటె రెండవదానిలో వాడుకభాషా పదములు ఎక్కువగా ప్రయుక్తమైనట్లు మీరు గ్రహించగలుగుతారు. ఇదేవిధంగా మిగిలిన గీతాలలో నేను అభివృద్ధిని సాధించాను.

* * *

మీల్డాప్యాలస్
15 బెలియఘట్
29 జనవరి 12

మహాశయా, *

నా పుస్తకాన్ని శ్రీ బాబూ సురేంద్రనాథ్ ఘోష్ మీకు ఆలస్యంగా అందచేసినందువల్ల నేను మరొకలాగ అనుకోలేదు. అదీకాక ఆ ప్రతి బాగా నలిగిపోయింది. ఇప్పుడు మీకొక మంచిప్రతిని పంపిస్తున్నాను. భాషాసాహిత్య విషయాలలో మా

* పూర్తిగా దొరకని ఉత్తరము.

తెలుగువారు అనేక సమస్యలను పరిష్కరించుకోవలసి వుంది. వాటిలో కొన్నిటిని నా ఆంగ్లపీఠిక మీకు విశదపరుస్తుంది. బహుభాషాసంకీర్ణమైన మా రాష్ట్రంలో గ్రాంధిక, ఆంగ్లభాషల ప్రాబల్యం హెచ్చు. సాధారణంగా మావాళ్లు ఇంగ్లీషున ఉత్తరాలు వ్రాసుకుంటారు. ఇద్దరు స్నేహితులు కలియడమే తడవుగా, ఇంగ్లీషున మాట్లాడుకుంటారు. గ్రాంధిక, ఆంగ్ల భాషల ప్రాబల్యంవల్ల, మా రాష్ట్రంలో వాడుకభాషల సాహిత్యం పెంపొందడంలేదు. అది వాటి ధాటీకి తట్టుకోలేకపోతోంది. అయితే తెలుగువారిలో సాహిత్యకృషి అధికం. అందుకు సందేహంలేదు. కాని తనకు తానై ఒక స్వతంత్రశైలిని కల్పించుకున్న రచయిత, కవి, మాలో కనిపించడు.

కొందరు పాశ్చాత్యభావాల మూలతత్వాన్ని సరిగ్గా అర్థం చేసుకోవడంలేదు. వస్తువుల బాహ్యాస్వరూప మిడిమిడి జ్ఞానంతో తాము విద్యాసంపన్నుల మనుకుంటున్నారు. 'సంస్కృతి పరులమని అనుకుంటున్న భారతీయులలో చాలా మంది ఇంతేనని నా నమ్మకం.

పూర్తి విద్యావంతుడు కాని ఈ నూతనమానవుడు తాను, పాతప్రపంచపు మనిషికన్న, అధికుడననే ఆత్మాతిశయంతో మెలగుతున్నాడు. ఈ అసంబద్ధ అధికతాభావం సంతృప్తిని కలిగిస్తోంది. స్వయంసమృద్ధిని సాధించాననే ఆత్మసంతృప్తి వ్యక్తిని ఎటూ పెరగనీయదు. అది అతని జ్ఞానానికేకాదు; మానవ విజ్ఞానానికి సైతం పరిమితులను విధిస్తుంది. ఇలాంటి పరిమితులు పరిస్థితులు ఏర్పడ్డంవల్ల సాహిత్యంలో ఏమాత్రం నవ్యత కనిపించినా, కొందరు దానిని అజ్ఞానంతో నిరసిస్తున్నారు.

తెలుగులో నవ్యరీతులకు నూతన ప్రమాణాలకు ప్రయత్నించిన మొదటి కవిని నేనే. నా కావ్యకళ నవీనం; కావ్యయితివృత్తాలు భారతీయం. కవితలో నేను ఉత్తమ ప్రయోజనాలను ఉపలక్షించాను; జీవితాన్ని నూత్న దృక్పథంతో దర్శించి, కథా, కవితారూపంలో దాని తత్త్వాన్ని అన్వయించడానికి ప్రయత్నించాను. నా కా కళలపట్ల జీవితంపట్ల కొన్ని ఆదర్శాలు వున్నాయి. వాటిని సంస్కృతిపరులుమాత్రం అర్థం చేసుకుని హర్షించగలరు; సంస్కృతి శూన్యులు కావ్య కథాసంవిధాన, హాస్యధోరణులను గమనించి అంతటితో సంతృప్తి పడతారు.

కావ్య రచనలో ప్రాచీన సంప్రదాయములను ఎల్లకాలం అలాగే అట్టే పెట్టుకోవాలని కొందరి మతం. అనూచానంగా వస్తున్న ప్రాచీన సంప్రదాయాలకు భిన్నంగా ఎవరు ఏమి రచించినా, అది వొక ఘోరాపరాధంగా భావించి, వారిపై విరుచుకు పడుతున్నారు. కొన్ని శతాబ్దాల చరిత్రవున్న తెలుగు సాహిత్యంలో ప్రాచీన సంప్రదాయాల బలం అపారం. దీనిని కాదనడం మాటలతో పనికాదు. బెంగాలీ సాహిత్యం తెలుగు సారస్వతం వంటిదికాదు. అది ఇటీవల కాలంలోనే బయలు దేరింది. కనక తెలుగు సాహితీ రంగంలో నవ్యతావాదులు ఎదుర్కొనవలసి వస్తున్న ప్రతిఘటన ఎంత ప్రబలమైనదో, నిరంకుశమైనదో, బెంగాలీలు ఊహించలేరు...

కోట, విజయనగరం
20 జనవరి 1913

ప్రియమైన అయ్యా,

మద్రాసు విశ్వవిద్యాలయంలో సంస్కృత మాతృభాషల అధ్యయనమును గురించి, భారత ప్రభుత్వ గ్రాంటును [illegible]

గించవలసిన పద్ధతులను గురించి, జస్టిస్, శ్రీ పి. ఆర్. సుందర య్యారు కోరికను పురస్కరించుకుని, నేనొక నివేదికను * తయారుచేశాను. ఆ నివేదికను మీకు దీనితోపాటు పంపిస్తున్నాను; చెన్నరాష్ట్రపు తాత్కాలిక గవర్నరుగా మీరు విద్యావిషయములపట్ల అత్యంత శ్రద్ధను వహించారు. నూతన భాషాధ్యయన పద్ధతులను, నూతన ఆంధ్రసాహిత్యోద్యమాన్ని ప్రోత్సహించారు. అందుకు సంతోషం. నా నివేదికను మీరు మద్రాసు ప్రభుత్వమునకు అందచేయవలసినదిగా కోరుతున్నాను.

ఊటీలో వుండగా మీ పరిచయ భాగ్యం లభించింది. విజయనగరం మహారాజకుమారికా సాహెబావారితో వచ్చి, మిమ్మల్ని చూసి, నా గౌరవాభివందనాలను మీకు అందచేశాను. నేను తెలుగు నూతన సాహిత్యోద్యమాన్ని సంలీనము కావించుకున్న ఒక తెలుగు రచయితను.

* * *

అడ్మిరాల్టీ హౌసు
మైలాపూరు
మదరాసు, 21-4-13

ప్రియమిత్రమా,

మీరు 16 వ తేదీన పంపిన 'నోటు' విజయనగరంనుంచి ఇక్కడికి తిరిగివచ్చి నాకీవేళ అందింది. నూతన సంవత్సరాది సంచికను వెలువరించినందుకు నేనుమిమ్మల్ని అభినందిస్తున్నాను; సంచిక ముఖచిత్రం ముచ్చటగా వుంది. వ్యాసాలు అమూల్య

---

* చూ. వ్యాసచంద్రికలోని మహాకవి వ్యాసం : విశ్వవిద్యాలయాలు : సంస్కృత, మాతృభాషలు.

మైనవి. రామమూర్తి వ్యాసం ప్రచురించినందుకు నేనెంతో సంతోషించాను.

నాకు ఐ. బి. ఎ. ఆర్. ఏ ఎస్, పదహారవ సంపుటాన్ని మీరు పంపగలిగితే కృతజ్ఞుణ్ని. అది మూడు భాగాలు. మూడవ సంపుటిలో రాజా పృథ్వీమూలని గోదావరి శాసనాలు అచ్చు పడ్డాయి. అది నాకు అవసరం. ఆ భాగాన్ని వి. పి. పి. ద్వారా నా "హైలాండ్స్, కూనూరు, నీలగిరి" చిరునామాకు పంపించ మని మేనేజరుతో చెప్పండి. 24 వ తేదీన నేను కూనూరు వెడు తున్నాను. విడిగా రాజాపృథ్వీమూల శాసనాలున్న భాగమును అమ్మకపోయినట్లయితే, మొత్తం సంపుటిని, వి. పి. పి. ద్వారా పంపమనండి. శ్రమ ఇస్తున్నందుకు అన్యథాభావించరని నాకు తెలుసును.

మీ తామ్రశాసనాలపై వ్యాసం వ్రాసి, మే నెలలో ఉదకమండలం నుంచి మీకు పంపుతాను. అవి కృష్ణశాస్త్రిగారి చెంత వున్నాయి. ఆయన 'నరపతి విజయము' కావాలన్నారు. ఇస్తున్నాను. విజయనగర సామ్రాజ్యంమీద ఒక వ్యాసం వ్రాస్తా నన్న తన వాగ్దానాన్ని నిలుపుకోమని ఆయన్ని అడుగుతాను. సరేనా?

కొంతకాలం నుంచి మీరు నూతనోద్యమానికి సహాయ పడడంలేదు. నన్నయ్యవంటిమనిషే మనకు కావాలంటున్నారు. నన్నయ్య అపురూపమైనదేదీ సాధించలేదు. ఇదివరకటి కవులు నడిచినతోవనే తనూ నడిచాడు. అందులో అబ్బుర మేమీ లేదు. సాహిత్యరంగంలో ఇప్పుడు నేను కావిస్తున్న కృషికి సమతుల్యమైన కృషి భారతదేశంలో మరెక్కడా కనిపించదు. బెంగాలులో నూతనోద్యమం సంస్కృతిపరుల

సహాయాన్ని పొందింది. ఆ నవీనోద్యమానికి టేక్‌చంద్ నాయ కత్వం వహించాడు; బంకిమచంద్రుడు తోడ్పడ్డాడు. దానికి రవీంద్రుడు ఆధునిక ప్రవర్తకుడు. ఆయన రచనలను వంగీయ సాహిత్య పరిషత్తు కళ్ళకు అద్దుకుంటోంది; రచయితగా ఆయన్ని ఆరాధిస్తోంది. ఇక్కడ ఆంధ్రసాహిత్య పరిషత్తుదురదృష్ట వశాత్తూ మద్రాసు పక్షీయులచేతుల్లో చిక్కుకుంది. పరిషత్తును వారు మారుతోవలకు మళ్ళిస్తున్నారు. మార్పుకు వారు బద్ధ విరోధులు; పురోగతికి అవరోధకులు. సాహిత్యరచన భాషను ధ్వంసచేసే తాలింఖానావంటిదని మనం అనుకోవాలా? అందుకు గ్రంథరచన ఎందుకు? రోజూ పండితులు వ్రాసే వేలాది ఉత్త రాలు చాలవా!

మీ తెలుగు, తెలుగు కాదని అనేకసార్లు నేను విమర్శిం చాను. ఇంతవరకు మీరెవరూ నా ఆక్షేపణలకు సమాధాన మివ్వలేదు (1) మీరు వ్రాస్తున్న తెలుగు సలక్షణమైనది కాదు. ప్రాచీన కవుల ప్రయోగములకు గ్రాంథిక వ్యాకరణ సూత్రా లకు అది విరుద్ధం. కేవలం కృతకం. (2) వచనంలో పదాల కూర్పు మరీ వింత. వచన రచనా నైపుణ్యం రచయితలకు మృగ్యం. ఆంగ్లవచన సాహిత్యపు తీరును, పదప్రయోగ సరళిని, మన వచనంతో సరిపోల్చి చూస్తే భేదం యిట్టే మీకు బోధపడు తుంది. (3) ఇదివరకు మనకు వచనసాహిత్యం లేదు. ఆంగ్ల సాహిత్య ప్రభావంవల్ల, దాన్ని మనం సంతరించుకున్నాం. అది ఆధునిక ప్రక్రియ. ఆధునిక వచన శైలిలో, వాడుకలోలేని పాత శబ్దాలు ఎంతమాత్రం నప్పవు. అందువల్ల సాధ్యమైనంత వరకు, వాడుక పదాలనే విరళముగా ప్రయోగించాలి. అలా కాక, మీరు వాడుక పదాలకు మారుగా, ప్రాచుర్యంలోలేని

ప్రాచీన రూపాలను వెదికి వెదికి మరీ తీసుకువస్తున్నారు. ఇది మంచిపద్ధతి కాదు. (4) ఇంటరుమీడియటు తమిళ విద్యార్థులు పరీక్షలలో 'కాంపోజిషను' వ్రాసేటపుడు వ్యావహారిక తమిళ పదాలను మాత్రమే వాడవలెనని, విశ్వవిద్యాలయం నియమించిన కమిటీ నిర్ణయించింది. ఈ నిర్ణయం సముచితమైనది; సశాస్త్రీయమైనది. (5) శిష్టవ్యావహారిక భాషలో స్పష్టంగా సరళంగా సొగసుగా వ్రాయడం మీరనుకున్నట్లు సులభం కాదు. వ్యావహారిక భాషాపదాలు మీకు వినసొంపుగా వుండవు. అవును; ఎలా వుంటాయి ? బడిలో వేసినప్పటినుంచి, చదువు పూర్తి అయేవరకు కృతక గ్రాంథిక భాషలోవున్న వాచకాలను, పాఠ్య పుస్తకాలను చదవడంవల్ల, మీరు పడికట్టు రాళ్ళవంటి పదాలకు అలవాటు పడిపోయారు. ఆ అలవాటు మీకొక పద్ధతిని నూరిపోసింది. మీరలవాటుపడ్డ పద్ధతికి ఏమాత్రం భిన్నంగా కావ్యరచన సాగినా అది అతి అసాధారణంగా తల్లకిందులుగా మీకు కనిపిస్తుంది ! (6) సంస్కృత మహాపండితులు సైతం, తెలుగున శాసనాలను; శాసనాలనే కాదు, వ్యాఖ్యానాలను వాడుక భాషలోనే వ్రాశారు.

(7) మీరు వ్రాస్తున్న దోషభూయిష్ఠ వచన గ్రంథాలను పఠించడంవల్ల యస్. యస్. ఎల్. సి. ఇంటర్మీడియటు, బి. ఏ, ఎమ్. ఏ విద్యార్థులుకూడా,దోషభూయిష్టమైన భాషను అలవరుచుకుంటున్నారు. ద్రుతముపై యడాగమాన్ని యథేచ్ఛగా వాడుతున్నారు. విసంధిని పాటించిన వచన గ్రంథాలను చదవడంవల్ల విద్యార్థులకు కావ్యశైలి అబ్బుతుందని మీ ఉద్దేశమా ? గ్రాంథిక భాషా వ్యాకరణం నేర్చుకోడానికి అటువంటి పుస్తకాలు చదవాలికదూ ?

గ్రాంథిక భాషా వ్యాకరణ యుక్తపదాలపై వ్యవహారములో నశించిన శబ్దాలపై, రచయితలకు మోజువుంటే, పోనీ పద్యాలలో వాటిని ప్రయోగించి ఆనందించమనండి. కానీ, వచనమైనా వాడుక భాషలో వ్రాయవద్దా! తప్పదు. వ్రాసి తీరాలి.

*　　　　*　　　　*

ఆడ్మిరాల్టీహౌసు
26 ఏప్రియల్ 1914

ప్రియమైన శ్రీ కృష్ణయ్యగార్కి, *

మీరు 21 వ తేదీన విజయనగరం వ్రాసిన ఉత్తరం నాకు ఇక్కడ అందింది. ఈ ఏడు ఇంగ్లీషు పరీక్షకు హాజరుకాని విద్యార్థులకు ఏమాత్రం సదుపాయం చేయడానికి వీలులేకుండావుంది. అందువల్ల రూల్సు మార్చవలసివుంటుంది. మీ రిపోర్టులో ఈ విషయం మర్చిపోకుండా జ్ఞాపకం పెట్టుకోండి:

ఈ నెలాఖరు వరకు నేను మద్రాసులో వుంటాను. మే ఒకటో తారీఖున కూనూరు వెడతాను. ఆన్సరు పుస్తకాలు 29 వ తేదీన మీరు నా మద్రాసు చిరునామాకు పంపిస్తే నాకు మే ఒకటవతేదీన అందుతాయి.

*　　　　*　　　　*

మదరాసు
12-5-14

అయ్యా,

విద్యార్థుల సమాధాన పత్రాలను దిద్దేటపుడు వ్యత్యాసం రావడం సహజం. క్లాసికల్ తెలుగు పత్రాలను దిద్దిన సహాయ

* శ్రీ డి. సి. కృష్ణయ్యగారు బి. ఏ. ఎల్. టి., తెనాలి.

పరీక్షకులు, శిష్ట వ్యావహారికపదాలను వ్యాకరణ విరుద్ధప్రయోగాలుగా అపార్థం చేసుకుని, విద్యార్థులకు రావలసిన మార్కులను తగ్గించివేశారు.

♦ ♦ ♦

హైలాండ్సు, కూనూరు
17 మే 1914

ప్రియమైన అయ్యా, *

ఇంతవరకు సమావేశం ఎపుడో నాకు నోటీసు అందలేదు. శ్రీ వెంకట రంగారావుగారికి సమావేశపు తేదీ ఇంతకుముందే తెలిసి వుండవచ్చును. పాఠ్యపుస్తకాల జాబితా తయారుచేయడానికి ఆయనకి వ్యవధిఉంది. ఎవరి కెపుడు నోటీసులు పంపించారో మీరు ఆఫీసులో వాకబు చేయాలని నా అభ్యర్థన. తొందరపడి సమావేశాలలో నిర్ణయాలు చేయడం మంచిదికాదు. వ్యవధి అవసరం, సమావేశాన్ని వాయిదా వేయాలని నా కోరిక. అందుకు వీలులేకపోతే ఈ సమావేశంలో మిగతా విషయాలను చర్చించవచ్చును. ఇంకొక సమావేశంలో తెలుగు పాఠ్యపుస్తకాలను నిర్ణయించవచ్చును.

'బోర్డు' ఇంతవరకు ఒక ముఖ్యవిషయాన్ని అంతగా పట్టించుకున్నట్లు నాకు కనబడదు. దీన్ని మీరు జాగ్రత్తగా పరిశీలించాలని నేను కోరుతున్నాను. "మెట్రిక్యులేషను పరీక్షకు వేసే పుస్తకాలు ప్రధానంగా ఆధునిక వచనంలో వుండితీరా"లని 176వ సూత్రం స్పష్టంగా నిర్దేశిస్తోంది. యస్. యస్. ఎల్. సి.

---

* టి. రామకృష్ణ పిళ్ళై; 'ద్రవిడ భాషల బోర్డాఫ్ స్టడీస్' ఛెయిర్మను.

పరీక్షకు వెడుతున్న అభ్యర్థులలో అత్యధిక సంఖ్యాకులు, 'ఆధునిక తెలుగు'నే తీసుకుంటున్నారు.

సెకండరీ స్కూళ్ళ నిర్వాహకులకు, ఉపాధ్యాయులకు మద్రాసు విద్యా నిబంధనల ప్రకారం, విద్యాశాఖవారు. ఈ విధంగా తమ సూచనలను పంపించారు:

"వచన పాఠాలు... ప్రధానంగా మాటలాడుకునే భాషాశైలిలో వుండాలి. శిష్టులు మాటలాడే మాతృభాషను అలవరుచుకుందుకు ఆ పాఠాలలో విద్యార్థులకు తరిఫీదు ఇవ్వాలి." మాతృభాషా వ్యాకరణాలవిషయంలో విద్యాశాఖ ఇలాగ ఆదేశించింది: "ఎంతవరకు వీలుంటే అంతవరకు అచ్చు పుస్తకాలలోని సూత్రాలను అన్వయాన్ని వదిలిపెట్టి, లక్ష్యమును చూపుతూ జీవద్భాషలోని వాక్యరచనా లక్షణాలను, భాషావిభాగ, పదప్రయోగసరళిని విద్యార్థులకు బోధపరచాలి."

విద్యాశాఖ సూచించిన పద్ధతులప్రకారం కొన్ని సెకండరీ స్కూళ్ళల్లో విద్యార్థులు జీవద్భాషను అభ్యసిస్తున్నారు. తగు తరిఫీదును పొందుతున్నారు. ఇంకా మరికొన్ని స్కూళ్ళల్లో ఈ పద్ధతులను అనుసరించి బడిపిల్లలు శిక్షణ పొందవలసివుంది. ఇలాంటి పరిస్థితులలో పాఠ్యపుస్తకాలను గురించి 176 వ సూత్రం విధించిన నియమాలు అమలు జరిగేటట్లు విద్యాశాఖ మరీ జాగ్రత్తపడాలి.

నేను ఈ నియమాలను దృష్టిలో పెట్టుకుని 1916 వ సంవత్సరపు మెట్రిక్యులేషను పరీక్షకు ఈ దిగువ ఉదహరించిన పాఠ్య పుస్తకాలను వేయవలసినదిగా సూచిస్తున్నాను: (1) పువ్వాడ వేంకటరావుగారు ముద్రించిన 'ఏనుగుల వీరాస్వామయ్య 'కాశీయాత్ర చరిత్ర.' అలహాబాదు, కాశీ, పాట్నా,

పాట్నానుండి కలకత్తావరకు ఆయనచేసిన యాత్ర. (2) బంకిమ చంద్రుని 'కమలాకాంతుడు' లేదా ప్రఫుల్లసేన్ 'కామధేనువు. (3) కేతన 'దశకుమార చరితము' 103-132; (3) రంగనాధ రామాయణము 'ఉత్తర కాండము (సరస్వతీ ప్రెస్)

(1) పేజీ 33 : 14 నుంచి 27; (2) 35 పేజీ మొదలు 38 వ పేజీలో 10 వరకు (3) 41 పేజీలో 19 నుంచీ 48 పేజీలో 1 వరకు.

♦ ♦ ♦

దిహైలాండ్సు
కూనూరు
18 మే 1914

ప్రియమిత్రమా,

మీటింగు ఎప్పుడో నాకింకా నోటీసు అందలేదు. ఈ వేళకూడా నోటీసు అందకపోవడం ఆశ్చర్యంగావుంది. కిందటి సంవత్సరం కంటె ఈపడు పాఠ్య గ్రంథాలను ముందుగానే నిర్ణయించాలని విశ్వవిద్యాలయాధికారులు ఒత్తిడి చేసినట్లయితే మీటింగు వాయిదా వేయడానికి వీలులేకపోయినట్లయితే, తప్పనిసరి కనక 1916 లో వేసిన పాఠ్యగ్రంథాలనే 1917 వ సంవత్సరానికి వేయండి. ఇంటర్ మీడియటు తెలుగు కాంపొజిషను మోడల్సుకు, శ్రీ వెంకటరంగరావు ఏమైన సూచించారనుకుంటాను. నేను పంపుతున్న బ్రౌను పుస్తకమో, ఏనుగుల వీరాస్వామయ్యగారి 'కాశీయాత్ర చరిత్ర'నో వేయమని నా సూచన. కాని ఇంత అత్యవసరంగా పుస్తకాలను నిర్ణయించక, నాలుగయిదు వారాలు ఆగితే ఏమిప్రమాదం? 1917 వ సంవ

త్సర పాఠ్య గ్రంథాలను గురించి ఆలోచించడానికి అంత తొందరపడనక్కరలేదు.

*　　　*　　　*

**అయ్యా ***

బ్రౌను పరిష్కరించిన 'దివార్సు ఆఫ్ ది రాజాస్' పరిశీలించతగ్గ పుస్తకం. తెలుగు వచన సాహిత్య చరిత్రలో దీనికొక ప్రధానస్థానం వుంది. బ్రిటిష్ ప్రభుత్వస్థాపనానంతరం, తెలుగున వెలసిన వచనసాహిత్యాన్ని పండితులెవరూ యింతవరకు పరిశీలించకపోవడం వింతగావుంది.

గ్రంథరచనకు, గ్రంథ ప్రచారానికి యిక్కడి పరిస్థితులు వేరు; పాశ్చాత్యదేశాల పరిస్థితులు వేరు. ఇంగ్లండులో గ్రంథకర్తృత్వం ఒక ఉద్యోగం వంటిది. గ్రంథరచనవల్ల యిక్కడ జీవనోపాధికలగదు. పుస్తకాలు వ్రాసి కాలం వెళ్ళబుచ్చడం; చిల్లిపడవమీద ప్రయాణం చేయడంవంటిది. అందుకు ఏ రచయితా, సాహసించడు. పాఠశాలలో ఉపాధ్యాయుడుగానో, మరెక్కడో ఏ ఉద్యోగమో చేసుకుంటూ రచయిత, కాలం గడపవలసివుంటుంది. అయితే ఆధునిక కాలంలో ఉద్యోగులుగా రాణించేవ్యక్తులు, ఆంగ్లవిద్యాధికులు మాత్రమే. మాతృభాషలలో పాండిత్యమున్నా, ఆంగ్లభాష రాకపోతే, గొప్పపదవులు ఉద్యోగాలు దొరకవు. ప్రభుత్వోద్యోగులుగానో, న్యాయవాదులుగానో ప్రసిద్ధిపొందుతున్న వ్యక్తులకు, తమ మాతృభాషపైకంటె, ఆంగ్లభాషమీద వ్యామోహం హెచ్చు. మాతృభాషలలో పాండిత్యం సంపాదించడం కష్టమని ఆంగ్లవిద్యాధికుల భావం.

---

* పూర్తి చేయని పోస్టుచేయని ఉత్తరం.

మన కళాశాలలలో బోధిస్తున్న ఆంగ్లవిద్య అసమగ్ర మైనది. సాహిత్యకళ, సాహిత్య విమర్శనల పరిజ్ఞానం ఆంగ్ల విద్యార్థులకు అబ్బడంలేదు. ఆంగ్లసాహిత్యఅధ్యయనంవల్ల విద్యార్థులకు సారస్వతాభిరుచి కలగడంలేదు. వారిని కేవలం ఉద్యోగులుగా తయారుచేయడానికి అది ఉపకరిస్తోంది. వర్త మాన ఆంగ్లవాఙ్మయంతో పరిచయమున్న పట్టభద్రులను మనం వేళ్ళమీద లెక్కించవచ్చును.

తెలుగున నిజమైన సాహిత్యవిమర్శ వెలువడడం లేదు. ఇరవై ఏళ్ళుగా ఆ పేరుతో వెలువడుతున్నవి సృజనాత్మక కృషికి దోహదపడడంలేదు: ఒక శబ్దము ప్రాచీనకవి ప్రయో గము అవునా, కాదా, అనే మీమాంసతో కాలం వ్యర్థ మౌతోంది.

ఎట్టి సాహిత్యవిమర్శల, కావ్యకళల సహాయంలేకుండా, యిలాంటి పరిస్థితులలో తెలుగున వచనసాహిత్యం, ఆవిర్భ వించింది. ఆంగ్లవిద్యాపరిచయ మంతగాలేని, పండితులు వచన గ్రంథాలను వ్రాస్తున్నారు. తెలుగున ఆధునికవచనమును వ్రాయాలనే ఉత్సాహికి, ఆంగ్లసాహిత్య సన్నిహిత సంబంధం అవసరం ...!

* * *

ది హైల్యాండ్సు
కూనూరు
18 మే 1914

ప్రియ మిత్రమా *

మీరు 16 వ తేదీన దయతో వ్రాసిన ఉత్తరం అందింది.

---

* శ్రీ వేదం వేంకటరాయశాస్త్రిగారు

21 వ తేదీన సమావేశం. మీరన్నట్లు నెల్లూరునుంచి పనిగట్టుకుని మళ్ళీ మదరాసు రావడం మీకు కష్టంగావుంటుంది. మీ పనులు తారుమారు అవుతున్నందుకు నాకు విచారంగావుంది. నేను సమావేశానికి రాదలుచుకోలేదు; మీరు మరొకలాగ భావించరని నానమ్మకం. కొండలమీద వాతావరణం కొంత ప్రశాంతంగా వుంటుందని ఇక్కడకు వచ్చాను. ఇంతలోనే అటు ఇటు ప్రయాణంచేస్తే సుఖంలేదు. ఇక్కడ పదిహేనురోజుల పాటు ఎటూ కదలక విశ్రాంతి తీసుకోవాలనుకుంటున్నాను. అలాంటపుడు నేను మళ్ళీ మద్రాసువస్తే వాతావరణంమారడం వల్ల, దానికి అలవాటుపడడంతోనే సరిపోతుంది. ఇంతకీ సమావేశానికి నేను రాకపోవడం వల్ల, ఇబ్బందివుండదు. అర్హతవున్న అభ్యర్థికి సహాయం చేయడం నామతం. నేను అందుకే సమావేశానికి రావలసివుంటుంది. అభ్యర్థులకు మీరు అలాంటి సదుపాయం చేస్తారని నా విశ్వాసం. అందువల్ల ఆవిషయం పూర్తిగా మీకు వొదిలిపెడుతున్నాను.

ఈ ఏడు మళయాళంలో ఏడుగురు ఎం. ఏ, అభ్యర్థులు ఉత్తీర్ణులయారు. కొంతమందికి సెకండుక్లాసువచ్చింది. బహుశా ఎవరూ ఫెయిలైవుండరు. ఉన్నా ఒకరోఇద్దరో; అంతే. ఎం. ఏ. పరీక్షలకు ఇది ఆఖరు సంవత్సరం కనక వాళ్ళు అలాగ అభ్యర్థులను ప్రోత్సహించారు కాబోలు. మనంకూడా ఈవిషయాన్ని జ్ఞాపకం పెట్టుకోవాలి.

మార్కులను మనం ఒకరికొకరు తెలుపుకుని 'సర్క్యులేషను' వల్ల అభ్యర్థులఫలితాలను నిర్ణయించాలని నేను సూచించాను. నా సూచనను మీరు ఆమోదించినందుకు సంతోషం. కాని అదే అంతిమనిర్ణయంకాదు. 'సర్క్యులేషను పద్ధతి' అంటే

నాభావం అదికాదు. ఒకరువేసిన మార్కులు తమ అభిప్రాయా లతోపాటు ఇంకొకరికి పంపించి, వారి సూచనలను తాము తెలుసుకోవాలి. మాటవరసకి నేను సమావేశానికి రాలేకపో తాను. మీరు, రామయ్యగారు, నేనువేసిన మార్కులు మార్చితే బాగుండుననుకుంటారు. నా పరోక్షంలో, నాతో సంప్రదించనిదే, మార్కులుమార్చకూడదు. నాకు సూచనలుచేసే అవకాశం వుండి తీరాలి.

విద్యార్థులకు వ్యాకరణ జ్ఞానం హఠాత్తుగా కలగదు. అందుకు మొదటినుంచి ప్రయత్నం అవసరం. అన్నితరగతుల విద్యార్థులు, నిర్దుష్టమైన పాఠ్య పుస్తకాలను చదివే అవకాశం మనం కలిగించాలి. బోధనా పద్ధతులు మారిపోవాలి. సంస్కరణ అత్యావశ్యకం. ఈ విషయాలను విపులంగా శ్రీరామకృష్ణపిళ్లెకు తెలియపరిచాను. ఈ ఏడు ఇంటర్మీడియటుకు నిర్దుష్టమైన వచన గ్రంథాలను వేయాలనుకుంటున్నాను. అందాకా కొంతలో కొంత మంచిప్రయత్నం చేదామని నా ఉద్దేశం. విశ్వవిద్యాలయ పరీక్షలకు నిర్దుష్టమైన గ్రంథాలను వేయవద్దా! ఇంటర్మీడియటు విద్యార్థులకు మీ వచనగ్రంథాలలో ఒకదాన్ని, పాఠ్యభాగంగా వేయాలనుకుంటున్నాను. కాని మీ పుస్తకాలు ఇక్కడ నా దగ్గరలేవు. 'బోర్డాఫ్ స్టడీస్' సమావేశం 20 వ తేదీన జరపాలని శ్రీ పిళ్లె అనుకుంటున్నారు. వాయిదా వేయమని కోరాను, బహుశా వాయిదాపడుతుంది, మీ వచనగ్రంథాలను ఇక్కడకు పంపించవలసిందిగా మిమ్మల్ని కోరుతున్నాను. పాఠ్యపుస్తకా లలో అశ్లీలశృంగారం వుండరాదని విశ్వవిద్యాలయం నిర్దే శించింది. అలాంటివేమైనా వుంటే వాటిని మనం విడిచిపెట్టి ఎడిట్ చేసుకోవచ్చును. ఇంటర్మీడియటు విద్యార్థులకు మీ 'దశ

కుమారచరిత్ర' బాగుంటుందనుకుంటాను. శ్రీ రామకృష్ణపిళ్లే ఉత్తరం వ్రాశాక, మళ్ళీ మీకీ విషయంగురించి నేను వివరంగా వ్రాస్తాను. వికృతమైన తెలుగు అపభ్రంశపు సంస్కృతం కలగా పులగంచేసి కొందరు పుస్తకాలు వ్రాస్తున్నారు. ఎవరివైనా, అలాంటిపుస్తకాలను విద్యార్థుల నెత్తిమీద మనం రుద్దకూడదు. ఇంటరుమిడియటు, బి. ఏ లకు మీరు వ్రాసిన రెండునాటకాలను ఈ ఏడు వేయాలని ప్రతిపాదించాలనుకుంటున్నాను.

మీరు కోరుతున్నట్లు ఎం. ఏ. అభ్యర్థులకు చక్కటి వ్యాకరణజ్ఞానం వుండవలసిందే. సందేహం లేదు. కాని చాలా మందికి వ్యాకరణసూత్రాలను కంఠతా పట్టడంవల్ల కాక, భాషాపఠనం వల్ల అది అలవడుతుంది· ఆమాట మనం మరవ కూడదు. బడిలో వేసింది మొదలు బడి మానేవరకు విద్యార్థులు చదువుతున్న వచన పుస్తకాలనిండా వ్యాకరణదోషాలే. అలాం టపుడు వాళ్ళకి చక్కటి వ్యాకరణజ్ఞానం అలవడుతుందని ఎలా అనుకోగలం? దోషమంతా పాఠ్యగ్రంథాల రచయితలది, వాళ్ళని మనం ఏమీ అనలేక, విద్యార్థులను దండిస్తున్నాం.

ఇప్పుడే ఈ వాక్యాలు వ్రాస్తూంటే, రామయ్యగారి వద్దనుంచి మార్కుల పుస్తకం వచ్చింది. మార్కులు చూశాను. ముగ్గురు ప్యాసయారు; అంతా థర్డుక్లాసే! మనం ఇంతకంటె ఎక్కువ మందిని ప్యాసుచేయాలి. తప్పదు. విద్యార్థులస్థాయి ఉన్నతంగా వుండాలనేమాట బాగానేవుంటుంది. కాని దాన్ని సాధించడానికి మనం విద్యార్థులకు ఏవిధంగా సహాయపడు తున్నాం? సశాస్త్రీయమైన బోధనాపద్ధతుల్ని మనం పాఠ శాలల్లో ప్రవేశపెట్టినపుడు, నిర్దుష్టమైన పాఠ్యప్రణాళికను రూపొందించి, మంచి పుస్తకాలను వేసినపుడు, విద్యార్థులు

మంచిస్థాయిని, అలవరుచుకోగలుగుతారు. ప్రొఫెసర్లు, విద్యార్థులకు ప్రత్యక్షంగా బోధింపకపోవచ్చును. కాని, వాళ్ళకు సహాయపడే పుస్తకాలను మనం ప్రచురించవచ్చును.

ఎం. ఏ. తరగతులకు పాఠం చెప్పగలిగేవాళ్ళు మనలో ఆట్టేమంది లేరు. ఫస్టుగ్రేడు కాలేజిలో తెలుగు పండితులైనంత మాత్రాన, ఎం. ఏ కు పాఠాలు చెప్పగలరని నేననుకోను. ఇది, ఎం. ఏ లకు ఆఖరు సంవత్సరం. తెలుగుఆనర్సుకు ఏ కాలేజి ఎఫిలియేటు కాలేదు. ప్రెసిడెన్సీ, క్రిస్టియను కళాశాలలు, బి. ఏకు సైతం ఎఫిలియేటు కాలేదు. బి. ఏ ఆనర్సును మనం కొన్నేళ్ళకు కాని చూడం.

ఇద్దరు అభ్యర్థులకి 'కనీసమార్కుల'కు 11,13 మార్కులు తక్కువ వచ్చాయి. మనం వాళ్లని ప్యాసుచేయాలి. తప్పదు. మిగతా పేపర్లలో వాళ్లకి మార్కులు బాగా వచ్చాయి. మీరు నన్ను బలపరచాలని కోరుతున్నాను. వాళ్లమార్కులు హెచ్చించి రామయ్యగారికి ఇవాళ నేను 'ఫైనలులిస్టు' పంపిస్తున్నాను. వాళ్ళకి చెరొక మార్కు మీరు వేస్తే ప్యాసవుతారు. అది మీ ఇద్దరి ఇష్టం. రామయ్యగారికి నేను వ్రాస్తున్న ఉత్తరం, మీకు చదివి వినిపిస్తారు. కనక అదంతా మళ్ళీ మీకువ్రాయడం వృథా శ్రమ.

కూనూరు
18 మే, 14

ప్రియమిత్రమా*

నాకు, మార్కులు పంపించి, నాఅభిప్రాయాల్ని తెలియచేసే అవకాశం యిచ్చినందుకు సంతోషం. మీకు, నా ధన్య

* శ్రీ జయంతి రామయ్యగారు.

వాదాలు. ఈ ఏడు మళయాళంలో ఎం. ఏ. పరీక్షకు వెళ్ళిన విద్యార్థులు ఏడుగురు ప్యాసయ్యారు. ఈసంగతి మీకు తెలిసి వుంటుంది బహుశా, వాళ్ళలో ఎవరూ ఫెయిలై వుండరు. ఉన్నా, ఒకరో ఇద్దరో; యం. ఏ. పరీక్షకు ఇది ఆఖరు సంవత్సరం కనక మనం విద్యార్థులపట్ల 'సాధువు' గా వుండాలి.

176 వ నంబరు విద్యార్థికి 547, 181 వ నంబరు విద్యార్థికి 549 మార్కులు వచ్చాయి. కాని వాళ్ళు ఫెయిలై పోతారంటే నాకు విచారంగా వుంది నేను దిద్దినవాళ్ళ ఆన్సరు పేపర్లు మళ్ళీ చూశాను. అనువాదం పేపరులో ఒక్కొక్కరికి 85 మార్కులు మొదట వచ్చాయి; కాని అయిదేసి మార్కులు తగ్గించివేశాను. ఇప్పుడు, వాళ్ళకి మొదటవచ్చిన 85 మార్కులనే యిస్తున్నాను. నేను దిద్దిన టెక్స్టుపేపరు మళ్ళా జాగ్రత్తగా చూశాను. కొన్ని మార్కులు కలపాలనిపించింది. కలిపాను. కాని టెక్స్టుపేపర్లలో రావలసిన కనీసమార్కులకు ఒక్కొక్కమార్కు తక్కువ వచ్చింది. మీ పేపర్లలో మీరు ఆ మార్కు యిద్దరికీ అవకాశంవుంటే కలిపి పుణ్యం కట్టుకోండి. హాజరయిన విద్యార్థులలో 181 వ నెంబరు అభ్యర్థి రెండవవాడుగా కనిపించాడు. అతను మిగిలిన వారికంటె విమర్శలో మెరుగు. చక్కగా విమర్శించాడు; తన దృక్పథాన్ని అనేక వివరణలతో, సోపపత్తికముగా, అద్భుతంగా నిరూపించాడు.

నాతో మీరు శ్రీ వేంకటరాయశాస్త్రిగారు ఏకీభవిస్తే, తప్పక మరిద్దరు అభ్యర్థులు ఉత్తీర్ణులౌతారు. అపుడు వారిసంఖ్య ఆరు; ఇక పరీక్షలో ముగ్గురు వుండిపోతారు. అసలు నాఉద్దేశం లో ఉత్తీర్ణుడు కాదగనివాడు ఒకడు. అతను 182 వ నంబరు

అభ్యర్థి; అతనికి 349 మార్కులు మాత్రం వచ్చాయి. మిగిలిన వారిలో కొందరికి 500; మరి కొందరికి అంతకంటె హెచ్చు మార్కులు వచ్చాయి. ఈ పరీక్షల్లోఒకడుమాత్రం వుండిపోవలసి వస్తుందని నే నిదివరకే మీకు చెప్పాను.

అభ్యర్థులలో ఎవరికీ చెప్పుకోతగ్గ పాండిత్యంలేదని, ఏ ఒకరూ మిమ్మల్ని మెప్పించలేక పోయాడని మీరు అంటు న్నారు. ప్రత్యేకంగా ఏఒక అభ్యర్థి, గొప్పపండితుడు కాక పోవచ్చును. కాని మొత్తంమీద అభ్యర్థుల స్థాయి సంతృప్తికరంగా వుంది: సరాసరి బాగుంది. అది అలావుంచండి. మీరొక విష యాన్ని అంగీకరించక తప్పదు. భాషా, సాహిత్యవిషయాలను తెలిపేగ్రంథాలు లేవు; ఉపాధ్యాయులు లేరు. ఇలాంటి పరిస్థి తులలో అభ్యర్థులు పరీక్షలకు హాజరవుతున్నారు. అభ్యర్థులలో కొందరు, దేశాభిమానంతో భాషాభిమానంతో సేవచేసి, తెలుగు సారస్వతరంగలో సాహితీపరులుగా, ముమ్ముందు రాణించగల రని నా విశ్వాసం. ఇపుడు వాళ్లెంతో శ్రమపడ్డారు. కొంత కాకపోతే కొంతైనా, మీరు వాళ్ళను ప్రోత్సహించండి. ఇక కొన్నేళ్ళవరకు మీరు తెలుగులో ఏం. ఏ. ను చూడరు.

174 వ నంవబరు అభ్యర్థి ఇంగ్లీషున బాగా ఆన్సరు చేయ లేదు. తప్పులువున్నాయి. అయినా, నేను మార్కులు తగ్గించ లేదు, ఇపుడు 10 మార్కులు మాత్రం తగ్గిస్తున్నాను. అతనికి సంస్కృతం బాగా వచ్చును; సంస్కృతభాషలో మంచి పండి తుడు. సందేహం లేదు.

◆ ◆ ◆

ఉదకమండలం
28 మే 1914

ప్రియమైన అయ్యా *

మీరు 21 వ తేదీన వ్రాసిన ఉత్తరం అందింది. చాలా ప్రయాసపడి పాఠ్యపుస్తకాలను ఎన్నిక చేశాను. పని మొన్న టికిపూర్తిఅయింది నిన్న మేం సంతకంచేసి, జాబితాను పంపించాము. బట్టరువర్తు శాసనసంపుటిలో నేను పేర్కొన్న శాసనాలను బి. ఏ. అయిదో గ్రూపుకు వేయవచ్చు. ఇవి చిన్నవి. మొత్తం 28. శ్రీ వెంకటరంగారావుగారు బి. ఏ. ఆరోగ్రూపుకు శాసనాలు నన్ను ఎన్నిక చేయమన్నారు. కాని నా సూచనలు అయిదో గ్రూపుకు బాగుంటాయి. ఆరోగ్రూపుకు ఆయన ఎన్నిక చేయడం మంచిది.

ఇంటర్మీడియటు పాఠ్యపుస్తకాలను నిర్ణయించడంలో, ఆయనకి నాకు ఏకీభావం కుదరలేదు. ఇంటర్మీడియటు విద్యార్థులకు నాన్డిటైల్డుస్టడీకి అన్నిపుస్తకాలు అనవసరం. పిల్లలపై మోయలేని భారాన్ని మోపకూడదు. ఒక ప్రాచీనకావ్యం, ఒక ఆధునిక వచనగ్రంథం వేస్తే చాలును. తిక్కనవిరాట పర్వ భాగాన్ని నేను సూచించాను. ఇంతకంటె ఉత్తమ కావ్య భాగాన్ని ఎన్నికచేయడం సాధ్యంకాదు. కళాశాల ఆంధ్రపండితులు శ్రీ డి. సూర్యనారాయణ శాస్త్రిగారు, పీఠికతో, అనేక పాఠాంతరాలతో, అర్థములతో విరాటపర్వాన్ని అచ్చువేశారు. అది విద్యార్థులకు చక్కగా ఉపకరిస్తుంది.

---

* శ్రీ ఫిలిప్సు, మద్రాసు.

తిక్కన విరాటపర్వం, గద్యపద్యములతో వుంది. ప్రాచీన గద్యశైలిని విద్యార్థులకు బోధించడానికి అది చాలును. వేరే ఇంకొక గద్యకావ్యం అవసరంలేదు. ఆధునిక తెలుగుకు బ్రౌను పరిష్కరించిన 'హార్సు ఆఫ్ ది రాజాస్' పఠనీయగ్రంథంగా సూచించాను. అందులో విషయం అతి ముఖ్యమైనది. దీన్ని ఎవరూ కాదనలేరు వాస్తవికజీవితంతో సంబంధంవున్న తెలుగు పుస్తకాలు చాలా తక్కువ. అందులో ఇది ఒకటి. బ్రౌన్ ఈ పుస్తకాన్ని అతి నేర్పుతో పరిష్కరించాడు. గ్రాంథిక వ్యావహారికభాషల ధ్వనిశాస్త్రానికి భేదం వుందని మనం మర్చిపోకూడదు. నేను సూచించిన ఈ రెండు గ్రంథాలు గ్రాంథిక, లేదా కావ్య, వ్యావహారికభాషల స్వభావాన్ని, సంధికార్యాలను తెలియచేస్తాయి.

శ్రీ వీరేశలింగం పంతులుగారు, ఆయన అనుయాయులు, తమ గ్రంథాలలో గ్రాంథిక లేదా కావ్య, వ్యావహారిక భాషల సంధికార్యాలను కలగా పులగంచేస్తున్నారు. వీటిని చదవడంవల్ల విద్యార్థులకు గ్రాంథికభాషా స్వభావం, సంధి కార్యాలు సరిగ్గా అర్థంకావు. ఒకపద్ధతి అంటూ తెలియక, విద్యార్థులు కూడినచోట్ల సంధిని ఉల్లంఘిస్తారు; కూడని చోట్ల పాటిస్తారు. ఈ రచయితలు వ్రాస్తున్న రచనగ్రంథాలను విద్యార్థులు చదివితీరాలని నేను నిర్బంధించను. కావ్యభాషా స్వభావం అర్థంచేసుకుందుకు తగిన ప్రాచీన కావ్యాలున్నాయి. నిర్దుష్టమైన ప్రాచీన కావ్యాలుకుకాదని, దుష్టమైన వచనగ్రంథాలను విద్యార్థులకు పాఠ్యభాగాలుగా నేను వేయను.

మాతృభాషాధ్యయనానికి ఆధునిక తెలుగు పఠనం అత్యావశ్యకమని విద్యాశాఖ గుర్తించింది. ఇంటర్మీడియటు

విద్యార్థులు పరీక్షల్లో పభాష ప్రాయాలనే ప్రశ్న. సిండికేటు నిర్ణయం అలావుంచండి. దానికి దీనికి సంబంధంలేదు. బ్రౌను పరిష్కరించిన పుస్తకం అవశ్యపఠనీయం. అందువల్ల విద్యార్థులకు పాండిత్యం అబ్బుతుంది. ఒకవేళ అపుస్తకాన్ని ఆమోదించక పోతే దానికి బదులుగా విరాటపర్వం పూర్తిగా వేయమని నా సూచన. ఇంతకుమించి ఇంకొకటి నేను సూచించను.

* * *

అయ్యా*

ఆధునిక తెలుగు వెర్నాక్యులరు కాంపొజిషను ఆన్సరు బుక్కులు మీకు పంపుతున్నాను. బోడపాటి వెంకటహనుమంత రావు నెంబరు ఒకచోట 29553; ఇంకొకచోట 29533 దీన్ని సరిదిద్దుకోవాలి...విద్యార్థుల సరాసరి మార్కులు వాళ్ళ సరాసరి సామర్థ్యపుస్థాయిని తెలియచేయవని నాఅభిప్రాయం కాంపొజిషను సూత్రాలను అర్ధంచేసుకున్న ఉపాధ్యాయులు, విద్యార్థులకు ఆ పద్ధతులు బోధించనంతవరకు, పాఠశాలల్లోదుష్ట వచనగ్రంథాలను పిల్లలు చదువుతున్నంతవరకు, విద్యార్థులస్థాయి ఇలాగే వుంటుంది. తప్పుదు అందువల్ల, వాళ్లనుతప్పుపట్టి ప్రయోజనంలేదు. ఇంటర్ మీడియటు పరీక్షలలో కూడా ఇవేపరిస్థితులు. పాఠశాలల్లో విద్యాబోధనా పద్ధతులు విధిగామారాలి. వాటిని సంస్కరించి తీరాలి. ఈపరీక్షల మంచిచెడ్డలను, పరీక్షవిధానాన్ని వివరిస్తూ, నాఅభిప్రాయాలను మీకుత్వరలోనే తెలియపరుస్తాను. నా అసిస్టెంటు ఒకాయన ఎక్సామినరు యింకా రిపోర్టు పంపలేదు. అది అందాక, నారిపోర్టు మీకు అందచేస్తాను.

* * *

---

* జార్జిమెడాక్సు, యస్. యస్. యల్. సి. బోర్డు కార్యదర్శి,

ప్రియమైన అయ్యా,

మీరు వెళ్ళిపోయాక 'తెలుగు కాంపొజిషను కమిటీ' లో జరిగిన సంఘటనలను, విశేషాలను వివరిస్తూ, డాక్టర్ బర్న్‌కు నేనొక ఉత్తరం వ్రాశాను. ఆ ఉత్తరం నకలును మీకు పంపిస్తున్నాను. నా వుత్తరాన్ని డాక్టర్ బర్న్ సిండికేటుకు అందచేశారు.

తమిళ కాంపొజిషను కమిటీలో ఎవరినీ నామినేటు చేయనక్కరలేదని 'ద్రవిడయను ఫోర్డాఫ్ స్టడీసు' చెయిర్మను శ్రీరామకృష్ణ పిళ్లె మొన్న నాతో అన్నారు.

వాడుక భాషలకు గ్రాంధిక భాషలకు మధ్యవున్న అఖాతాన్ని సిండికేటు గుర్తించడంవల్ల ద్రవిడ భాషలకు ఉపకారం జరిగింది. కాని కాంపొజిషను కమిటీల ప్రణాళికమాత్రం సత్ఫలితాలను సాధించలేకపోయింది. దీనికి కారణం లేకపోలేదు. శాస్త్రీయమైన దృక్పథంతో భాషాతత్వాన్ని అవగతం చేసుకునే పండితులు దేశంలోలేరు. కమిటీ సభ్యులలో చాలామందికి కాంపొజిషను ఏవిధంగా వుండవలెననే సమస్యను అర్థం చేసుకుని పరిష్కరించేశక్తి మృగ్యం. భాషాసమస్యను పరిష్కరించడమనేది వారి ఊహాకు అందని విషయం.

వాడుక భాషకు, గ్రాంధిక భాషకు ఇపుడున్న వ్యత్యాసాన్ని తొలగించి వ్యావహారిక భాషకు వ్యాసరచనలో ఒకస్థితిని కల్పించడం సిండికేటు లక్ష్యం. విరళంగావున్న శిష్టవ్యావహారిక పదములను ధారాళంగా వాడవచ్చుననే సాధారణ సూత్రమును ఆమోదించినట్లయితే, సిండికేటు లక్ష్యం బహుసులభంగా నెరవేరుతుంది. వివాదగ్రస్త వివరములలోనికి సిండికేటు దిగనక్కరలేదు.

*　　*　　*

విజయనగరం

అయ్యా,

మీకు వేరేకవరులో ప్రూఫు పంపుతున్నాను. అది రెండు మూడు పేరాలు కలిపినంత మాత్రాన పూర్తికాదు. అందు కెంతమాత్రం విలులేదు. నా పూర్తిమినుటు ఆఫ్ డిసెంటుగా దాన్ని నేను అంగీకరించలేను. ఆసంగతి మీకుబాగా తెలుసును. కమిటీ అర్జంటు సూచనలవల్ల, నాపూర్తిమినిటు ఆఫ్ డిసెంటును, మీరు దాఖలు చేయలేకపోవచ్చును. అలాఅయితే, మీకువీలున్న సాధ్యమైనంత త్వరలో నా వ్రాతప్రతులను నాకు పంపించి వేయండి. కాంపొజిషను కమిటి గత సమావేశపు కార్యక్రమ వివరణ ప్రతిని దయవుంచి పంపించకోరుతున్నాను.

*  *  *

అడ్మిరాల్టిహౌసు
మైలపూరు
24 మార్చి 1914

అయ్యా,

నేను సిండికేటుకు సమర్పించిన నా 'మినుటు ఆఫ్ డిసెంటు'కు చేర్చవలసిన అనుబంధము లన్నింటిని శ్రీమార్కు హాంటర్ ద్వారా పంపించాను. మొదట సమావేశకర్తలకు రెండు అనుబంధములనే అందచేశాను. అవినాకు వారు తిరిగి పంపించారు. వాటిని నేను హాంటర్‌కు పంపాను. ఈ అనుబంధములకు కాపీలు ఇపుడు నావద్దవున్నవి కనుక, ఒకసెట్టును మీకు పంపిస్తున్నాను. వాటిని నా 'మినిటు ఆఫ్ డిసెంటు' చివరను వరసగా చేర్చవలసినదని కోరుతున్నాను.

---

* గుమ్మిడూరి వేంకటరంగారావు.

విజయనగరం

ప్రియమైన అయ్యా,

మీపరిశీలనార్థము నేను ఈదిగువ పేర్కొన్న వాటిని మీకు పంపిస్తున్నాను. (అ) ది మినిటు ఆఫ్ డిసెంటు (ఆ) ఆంగ్ల మున రెండు అనుబంధములు (ఇ) మద్రాసు హైకోర్టువకీలు శ్రీ వి. రామేశంగారు ఆధునిక శైలిలో కూర్చినకథ.

నా 'ది మినిటు ఆఫ్' పరిశోధనాత్మక నివేదిక. కొన్ని సాంకేతిక పదాలు వాడక తప్పిందికాదు. వాటిని సాధ్యమైనంత వరకు తగ్గించాను. అది సులభద్యోతకము దీనితోపాటు మీకు పంపిన వివరణము నా మినిటు ఆఫ్ డిసెంటును చక్కగా అవగతం చేసుకుందుకు తోడ్పడుతుంది.

*    *    *

కోట. విజయనగరం
1 ఏప్రియల్ 1915

ప్రియమైన అయ్యా, *

రేపే, నేను చెన్నపట్టణం బయలుదేరుదామనుకున్నాను. కాని జ్వరంవచ్చింది. మొదట అనుకున్నట్లు సహాయ పరీక్షకులకు అరవతేదీన నాసూచన ఇవ్వలేను. మీ వద్దనుంచి మళ్ళీ వర్తమానం వచ్చేవరకు, వారిని మద్రాసు రావద్దని కోరండి. నేనక్కడికి వచ్చిన తరవాత. సమావేశం ఎప్పుడు జరిగేదీ మూడురోజులు ముందు చెబుతాను. ఒకాయన నెల్లూరులో, ఇంకొకరు నార్త్ ఆర్కాటుజిల్లాలో వున్నారు. సమావేశపు

---

* జార్జి మెడాక్సు యస్. యస్. యల్. సి బోర్డు కార్యదర్శి.

తేదీకి వారు రాగలిగితే సరేసరి. రాకపోతే వారు వచ్చేవరకు నేను మద్రాసులో వుంటాను. నాకు అక్కడ విశ్వవిద్యాలయపు పనులు ఎలాగ వున్నాయి.

ఈ ఏడు మీరు తెలుగు కాంపొజిషను పరీక్షకులకు చాలా సూచనలు పంపించారు. ఆధునిక తెలుగుకు సంబంధించిన విషయాలను వివరిస్తూ, సహాయపరీక్షకులకు కొన్ని సూచనలు సూచించాను. అవి వారికి రేపో ఎల్లుండో అందుతాయి. వాటి ప్రకారం వారు విద్యార్థుల సమాధానపత్రాలనుదిద్ది మార్కులు వేయవచ్చును.



# సంస్థాన వ్యవహారాలు

ఉదకమండలం
20 సెప్టెంబరు 1905

ప్రియ మిత్రమా,

మీరు 12 వ తేదీన వ్రాసిన ఉత్తరం నాకు 16 వ తేదీన అందింది. మీరు పంపిన నా రిపోర్టుల ఫైలు అందినట్లు ఇదివరకే మీకు తెలియపరచాను. మీరు కనుగొన్న విషయం కొలంబస్ కావించిన పరిశోధనను జ్ఞప్తికి తెస్తున్నది. శ్రీ జగన్నాధరావు గారి పిటీషనులకు నా సమాధానాలను నేను ఇవాళ పంపిస్తున్నాను. బెజవాడ శాసనానికి విజయనగరం రాజకుటుంబానికి సంబంధం వున్నదని మీరు కావించిన పరిశోధన బాగున్నది. సంతోషం *. దావా, వాయిదా పడ్డట్టు పత్రికలలో చదివాను. నవంబరులో కాబోలు వాయిదా, ఇందుకు ప్రత్యేకం నేను

* "దురదృష్టవశాత్తు ఆనందగజపతి మహారాజు, కీర్తిశేషు లవడంచేత సంస్థానపు వారసత్వదావాలో 1897 నుండి 1912 వరకు అప్పారావుగారు తల మునుకలుగా వుండిపోవలసి వచ్చింది. పదిహేను సంవత్సరాలలో అప్పారాయ మహాకవి చారిత్రక పరిశోధనకు, సాహిత్య వ్యాసంగాలకూ పెద్ద ఆటంకాన్ని కలిగించి, యీ వారసత్వపుదావా, తెలుగుజాతికి రావలసిన మహదైశ్వర్యాన్ని రాకుండా చేసింది."— శ్రీ సెట్టి ఈశ్వరరావుగారు.

మదరాసు వచ్చి లాయరుతో చర్చించవలెనా? మీకంటె లాయరు ఎక్కువ సాయపడతాడని నాకు నమ్మకం లేదు.

ఇంతకీ నా సాక్ష్యం సంగతి? కమిషన్ముందు నేను సాక్ష్యం చెప్పవలసివుంటుందనుకుంటాను. డిసెంబరు చివరివారం లోనో, జనవరి మొదటివారంలోనో, నేను దక్షిణప్రాంతాలకు వెళతాను. అందువల్ల నా పరిశోధనకు ఆటంకం కలగకుండా, డిసెంబరులోపున నాసాక్ష్యం తీసుకుంటే మంచిది. తిరునల్వేలి నుంచి రావడమంటే కష్టంకదూ! త్వరగా నాసాక్ష్యం తీసుకో మని వకీళ్ళను అడగండి.

మీరు నాకు వ్రాసిన ఉత్తరంలో ఒక చిన్నపత్రం కని పించింది. అది చదివి చూస్తే నాకే వింత అనిపించింది. పొర పాటున కవరులో పెట్టివుంటారు. బహుశా అది సంస్థాన వ్యవ హారాలకు సంబంధించిన పత్రమయివుంటుంది. ఉద్యోగులతో

---

ఆనందగజపతి, 1897లో స్వర్గస్థులయారు. వారికి పిల్లలులేరు. తన అనంతరము తన మేనమామ కుమారుని దత్తత చేసుకోవలసినదని ఆయన తన తల్లిగారు అలక రాజేశ్వరి మహారాణికి అనుజ్ఞయిస్తూ ఒక మరణశాసనం వ్రాశారు, దాని ప్రకారం ఆమె దత్తత స్వీకార మహోత్స వం జరిపించారు. ఈ విల్లు, నిజమైనదికాదని, దత్తతచెల్లదని తామే వారసులమని, రాజబంధువులు దావా వేశారు. దీనిని పెద్దదావా, వార సత్వదావా లంటారు. ఆదావాలో వంశమూలపురుషుల వృత్తాంతాదివి శాసన ప్రమాణాలతో నిరూపించవలసి వచ్చింది. అప్పారావుగారు అందుకుగాను "ఉషాభ్యుదయము శ్రీకృష్ణవిజయము" మొదలైన అనేక ప్రబంధములను శాసనములను పరిశోధించి సాక్ష్యములను సేకరించి, యించుమించు తామే ఈదావాను నడిపించారు. చివరకు అపీలులో ఇరుపక్షలవారికి అప్పారావుగారు రాజీచేసి, దీనిని పరిష్కరించారు.

డబ్బు విషయం మీరు చర్చిస్తున్నట్లున్నారు. కాని చదివితే నాకూ సరదా అనిపించింది.

శ్రీ యస్. యస్,

సికింద్రాబాదు
16-9-12

ప్రియమైన బావగారూ,

మీ ఉత్తరం నాకు నిన్నరాత్రి అందింది. మీరన్నమాట అక్షరాలా నిజం. మనది సాఫీ మార్గం. లావాదేవీలు పెంచే రాజీవొద్దు. ఇక అసలు విషయానికి వస్తాను. మహారాణీవారికి నగలమీద 14, 15 లక్షల అప్పు ఇవ్వడానికి కోవాజీ ఒప్పుకున్నాడు. తన షరతులను తెలుపుతూ ఆవిడకు ఉత్తరం వ్రాశాడట; కాని సమాధానం రాలేదు. వివరాలన్నీ మీకిదివరకే నేను వ్రాశానుకద! నాలుగయిదేళ్ళల్లో వస్తువులు విడిపించుకోవాలంటున్నాడు. నగలు తాకట్టుపెట్టమని, అప్పుపత్రం వ్రాసి యిస్తామని ట్రస్టీలు అన్నారట. నేను నా ఉత్తరంలో వ్రాసిన విషయాలన్నీ జాగ్రత్తగా అలోచించి, నన్ను వ్యవహారం ఏవిధంగా ఖాయపరచమంటారో ఉత్తరం వ్రాయండి. నేను సదాశివలేకర్‌తో బొంబాయి వెళుతున్నాను. మీ సూచనల ప్రకారం నడుచుకుంటాను. ఆలస్యమయితే, అతను తనవద్దనున్న ఈ సొమ్ము యింకొక వ్యాపారంలో మదుపుపెడతాడు.

*　　　　*　　　　*

## లలితకుమారిదేవి *

కోట, విజయనగరం

21 ఫిబ్రవరి 1913

ప్రియమైన పండిత అప్పారావు

మీ వద్దనుంచి సమాచారం రోజూ అందుతున్నందుకు చాల సంతోషం. మనకు విజయం చేకూరుతుందని నావిశ్వాసం. మీరు లేనికొరత ఇక్కడ ఎంతో కనబడుతున్నది. నారాయణ మూర్తిని గురించి మహారాజావారికి టెలిగ్రాం ఇమ్మని ఇవాళ పొద్దున్న నేను మీకు ఇచ్చిన టెలిగ్రాంలో కోరాను. మహారాజావారు క్యాంపులో వున్నారు, క్యాంపునుంచి ఇవాళ వస్తారు. అపీలు సంగతులను తెలుపుతూ మీరు, మా తండ్రిగారికి ఉత్తరం వ్రాస్తారని ఆశిస్తున్నాను. మీ ఆరోగ్యం ఎలా వుందో తెలుసుకుందుకు ఆత్రుతపడుతున్నాను. మీ టెలిగ్రాంలో ఆవిషయం తెలియచేయలేదు. మీకక్కడ సౌఖ్యముగా వుందో లేదో అని ఆలోచిస్తున్నాను. విశేషములు లేవు. ఉత్తరమును ముగిస్తున్నాను,

* * *

---

* అనందగజపతి విల్లుప్రకారం, వారి మేనమామ కుమారుడు విజయరామ గజపతి మహారాజావారికి సంస్థానము దఖలుపడ్డది. ఆయన భార్య లలితకుమారిదేవి, ఈమె, ఖాస్మండురాజా సూర్యబక్సింగ్‌గారి కుమార్తె.

కోట, విజయనగరం
13 జూలై 1913

ప్రియమైన అప్పారావు,

మీ టెలిగ్రాం అందింది. నాకూ, శ్రీ ఫౌలరుకూ మధ్య జరిగిన ప్రసంగ సారాంశాన్ని మీకు నేను చెప్పడం మరిచాను. "అప్పారావు కానీయండి, మరో బ్రహ్మండుడు కానీయండి; నేను డబ్బుమాత్రం అడ్వాన్సియ్యను" అన్నాడు. మీతోపాటు శ్రీనివాస అయ్యంగారిని తీసుకురండి. బాబుసాహేబ్‌కు వొంట్లో బాగులేదని ఆయనకు చెప్పారనుకుంటాను. వారిని వారి కుటుంబీకులను అడిగేనని చెప్పండి. మీరు ఆరోగ్యంగా వున్నారనుకుంటాను. ఆయనకు తీరికలేకుంటే వారు వచ్చేవరకు మీరు అక్కడ వుండిపో నక్కరలేదు. మీరిక్కడకు రావడం అవసరం.

• • •

## శ్రీ సూర్య బక్సింగ్ *

కాస్మండా
7 జనవరి 1913

ప్రియమైన పండిత అప్పారావు,

మీతో ఒకటిరెండు మాటలు. మాఅమ్మాయి క్షేమం కోరి మీరు చేయగలిన సహాయమంతా చేస్తారని నేను నమ్మ

* సంస్థానము ఎవరికి చెందవలెను అన్నవిషయం మదరాసు హైకోర్టు తేల్చవలసివుండగా, ప్రభుత్వం సంస్థాన వ్యవహారాలను అజమాయిషీ చేయడానికి ఒక ధర్మకర్తృత్వ సుఖాన్ని నియమించారు. దీనికి పెద్ద, ఫౌలరుదొర. ఈయన అప్పుడు కలెక్టరుగా వుండేవాడు. ఆనంద

తున్నాను. * కమిటీలో ఆవిడకు సభ్యత్వం వుండేటట్టు మీరు అన్ని ప్రయత్నాలు చేయాలి. • రీవా మహారాణి కమిటీలో ఏహోదాతో సభ్యురాలుగా వుండేవారో, అదేవిధంగా ఈవిడ కూడా వుండాలి. అలాగే ప్రయత్నిస్తానని మీరునాకు వాగ్దాన మిచ్చారు; కనక నేనీసంగతి నొక్కి అపీళ్లనన్నిటినీ తోసిపుచ్చే టట్లు మీరు శాయశక్తుల పాటుపడతారని నానమ్మకం. మీమీద మాఅందరికీ ఎంతో విశ్వాసంవుంది. మాకుమా త్రైకు, మీపట్ల ఎంతటి గౌరవ విశ్వాసాలున్నవో నేను వేరే చెప్పనవసరంలేదు. ఆ విషయం మీకూ తెలుసును.

పి ం ఛ నీ

విజయనగరం

లా బ్రాంచి

పంపిన తేది: 12-2-13

శ్రీ గురజాడ అప్పారావు పంతులు 1913 జనవరి 4వ తేదీన సంస్థాన ధర్మకర్తకు పెట్టుకున్న అర్జీపై ఎండార్సు మెంటు.

## శ్రీ జి. అప్పయ్య రిమార్కులు

నాకు మహారాజావారి కళాశాలలో శ్రీ అప్పారావు గారిచెంత ఎఫ్. ఏ., బి ఏ. క్లాసులు చదువుకునే అదృష్టం కలి

---

గజపతి సోదరి రీవామహారాణి, విజయరామగజపతి; హైకోర్టు అడ్వ కేటు పార్థసారధి అయ్యంగారు ఈకమిటీలో సభ్యులు.

• రీవారాణిగారు 1912 లో మరణించగా వారి సభ్యత్వానికి ఖాళీ వచ్చింది.

గింది. ఆయన అతి సమర్థుడు; ఉత్తమ అధ్యాపకుడు. విద్యార్థులు ఆయన్ని పూజ్యభావంతో చూసేవారు; ఆయన విద్యార్థులను ప్రేమించేవారు. ఆనందగజపతి మహారాజావారికి ఆయనమీద అమిత గౌరవం. సంస్థాన వారసత్వపు దావా, మీదపడి తల మునకలుగా వున్నపుడు ఆయన దానిని చక్కగా నడిపి ఆదుకున్నారు. తమ శక్తిసామర్థ్యాలవల్ల, నిష్కళంకమైన వ్యక్తిత్వంవల్ల, దుష్టశక్తులను దూరంగా వుంచగలిగేవారు. ఋజుప్రవర్తన కలిగిన వ్యక్తులకు సహాయపడేవారు. రీవారాణి వారి ఆంతరంగిక కార్యదర్శిగా, తమ పలుకుబడిన దుర్వినియోగం చేయక, నిజాయితీపరులకు ఆసరా ఇచ్చేవారు ఆయన లేకపోయినట్లయితే, పెద్దదావాలో ఎంత ధనం ఖర్చు అయేదో ఊహించలేం; డబ్బు వృధాగా ఖర్చు అవడమే కాకుండా, సంస్థాన వ్యాజ్యంలో ప్రతికక్షులు గెలుచుకుని వుండేవారు. ఆయన సలహా సాయమూ మనకు అవసరం. సంస్థాన వ్యవహారాలు ఆయన సలహాసహాయమూ లేనిదే చక్కగా సాగవు. నేను ఉద్యోగానికి వచ్చినప్పటినుంచి, ఆయన దక్షతతో నడిపిన వ్యవహారాలు ఇవి: (అ) వెలగాడ దావా (ఆ) కొండపాలెం దావా (ఇ) కత్రిమకొండ దావా. ఆఖరి దావా పూర్తిగా ఆయనే స్వయంగా నడిపించారు. ఇది సంస్థాన వ్యాజ్యాలలో అతి ముఖ్యమైనది. ఏమంటే సంస్థానానికి వ్యతిరేకంగా హేమాహేమీలు....గారలు సాక్ష్యాలు యిచ్చారు. ఇది కనక గెలవకపోయినట్లయితే, దీనిని పురస్కరించుకుని అనేక దావాలు మీదపడును. ఈనారిమార్కులతో ఈ అర్జీని మంజూరు చేయవలసిందిగా, ట్రస్టీని, కమిటీని నేను కోరుతున్నాను.

ఫౌ లరు

దీనిని మంజూరు చేయవలసినదిగా హృదయపూర్వకంగా కోరుతూ, దీనిని కమిటీకి పంపిస్తున్నాను.

శ్రీ యస్. శ్రీనివాస అయ్యంగారు

శ్రీ ఫౌలరు ప్రతిపాదనలతో ఏకీభవిస్తున్నాను. ఆమోదిస్తున్నాను.

శ్రీ విజయరామరాజు

సంస్థానానికి, కుటుంబానికి చేసిన సేవకు ప్రతిఫలంగా అప్పారావుకు నెలకు 140 రూపాయలు పింఛను యివ్వవచ్చును.

ఫౌలరు :

శ్రీ గురజాడ వెంకటఅప్పారావు కావించిన ప్రత్యేక సేవలదృష్ట్యా, సంస్థానం నుంచి నెలకు 140 రూపాయలు చొప్పున ప్రత్యేక పింఛను తీసుకుందుకు మంజూరు చేయడమైనది.

* * *

జె. సి. హెచ్. ఫౌలరు

వాల్తేరు
8 మే 1913

ప్రియమైన అప్పారావు,

మీఉత్తరం నాకిపుడే అందింది. సంస్థానానికీ అతి నమ్మకంతో మీరు చేసిన సేవ, మేలు మరువరానిది. తంత్రాలకు మీకు ఆమడదూరం. మీది కేవలం ఋజుమార్గం. మీరు కావించిన సేవకు

ప్రతిఫలం అందించే మహాద్భాగ్యం నాకు పట్టింది. సంతోషం. అమ్మకమువల్ల వచ్చిన సొమ్ము, అప్పుకు 'విరియా' వేస్తాను. ఎగ్రిమెంటు పత్రాలవిషయం, మహారాజా మహారాణులదృష్టికి తెచ్చి, వారుఅనుకూలంగా ఆలోచించేటట్టు చూస్తాను. బ్యాంకు వాళ్లు, అప్పుతీర్చమని నెత్తిమీద కూర్చున్నారు. నగలు తాకట్టు పెడితేతప్ప, ఫిరాయించడం కష్టం. పధ్నాలుగున్నర లక్షల లోను, కొంతడబ్బు బ్యాంకుకి జమకడదామంటే మరి కాసల్ దాస్ ఋణంమాట? అతనూ ఊపిరి సలపనీయడంలేదు. జూన్ ముప్ఫైలోపున, బాకీ జమకట్టకపోతే, దావా చేస్తాడట! ఈ లోపున అప్పుపుట్టడం సాధ్యంకాదు. వ్యవధి తక్కువ. పరిస్థితులు ఎంత గడ్డుగా వున్నాయో, కమిటీ అర్థం చేసుకుంటుందను కోను. మీసలహాకోసం నిరీక్షిస్తున్నాను.



# * పాతఇల్లూ : కొత్తఇల్లూ

కోట, విజయనగరం

7 ఫిబ్రవరి 1913

ప్రియమైన అయ్యా

నిన్న మీరు దయతో వ్రాసిన 'నోటు' అందింది. అందుకు మీకు నా ధన్యవాదాలు. నేను వుంటున్న ఇల్లు సంస్థానం వారిది. ఈ ఇల్లును అరవై ఏళ్ళక్రితం విజయరామరాజు సంపాదించారు. నేను ఇందులో వుండడానికి ఇరవై ఏళ్ళక్రితం ఆనంద గజపతి నాకు అనుజ్ఞ యిచ్చారు. అద్దె లేకుండావుంటే, వున్న వాళ్ళకు ఇళ్ళమీద హక్కు ఏర్పడుతుంది; కనక అది భావ్యం కాదని తలచి సంస్థానంవారు, తమ యిళ్ళకు అద్దె చెల్లించ

---

* సంస్థానము వారిచ్చిన ఈ ఇంటిని మహాకవి విరగదీసి బాగు చేయించుతున్నారు. ఇల్లు : వీధివరండామీద రెండు అరుగులు. అరుగుల మీద రెండు పంచపాళీలు. వీధి వరండా దాటగానే ఒక పెద్దసావడి. దానిమీద ఒకగది. సావడిదాటగానే నాలుగిళ్ళవాకిలి. చుట్టూవరండా. వాకిలికి తూర్పున వరండామీద ఒక ధాన్యపుకొట్టు. దానిమీద దక్షిణవైపు ఒక పెద్దహాలు. వాకిలికి దక్షిణాన ఒక పెద్ద భోజనాలహాలు. ఈ హాలు అవతల పెరటివరండా; వరండాపైని వంటయిల్లు, నుయ్యి. పడమటి వైపు ఒకసావడి. సావడినుంచి మేడపైకి మెట్లు. మేడమీద ఆయన చదువుకునే ఒకే ఒకహాలు, ఒక పడకగది. వీటికి ముందు వెనకాల వరండాలు.

మన్నారు. ఇదిజరిగి కొన్నేళ్లయింది. నేను వుంటున్న ఇంటికి నెలకు అయిదు రూపాయలు అద్దె. ఏడాదికి రెండునెలల అద్దె నేను చెల్లిస్తే చాలునన్నారు.

ఇల్లు చాలా పాతది; చిన్నది 'ఇమ్ము' తక్కువ. ఇంటి నేల, వీధి లెవెలుతో సమానంగా వుంటుంది. ఇంటి లెవిలును మించి వీధి లెవిలును పెంచాలని మ్యునిసిపల్ కాంట్రాక్టరులు జగడ మాడుతూనే వున్నారు మండువా, వీధి లెవిలుకి ఎలాగా తక్కువగా వుంది. ఇంటిలో మసలడానికి వీలున్నవి మూడే మూడు గదులు. ఒకటి కిందవుంది. రెండు మేడమీద వున్నాయి. మేడమీద రెండుగదులు నాపుస్తకాల బీరువాలతో, పెలువు లతో, రికార్డు పెట్టెలతో నిండిపోయాయి. అక్కడ మసలడానికి నాకేచోటు లేదు. అందువల్ల ఇంటవున్న వారంతా దిగువన వున్న ఆ ఒక్కగదిలోనే మసులుతున్నారు; కాలక్షేపం చేస్తు న్నారు. ఒకేగదిలో ఇంతమంది రాత్రిళ్ళు పడుకోవడంవల్ల అనా రోగ్యం దాపరించింది. ఇవికాక, ఇంట్లో ఒక వంటగది, భోజ నాలగది, సామానుగదులు వున్నాయి.

దివంగతురాలైన మహారాణీ మహారాజ కుమారికావారు 1898 - 99 లో గంగానదీ తీరాన ఒక ప్లాటును కట్టించదలుచు కున్నారు. ఆవిడ కోరికమీద నేను ఆపడు మెట్లు కట్టించాను. ఆ మరుసటి సంవత్సరం కేదారఘాటు భవన నిర్మాణం నా అజ మాయిషిలో కొనసాగింది. అపుడు ఆవిడ నాకొక వాగ్దానం చేశారు. తన కేదారఘాటు భవన నిర్మాణం పూర్తిఅయాక, గృహప్రవేశానంతరం, విజయనగరంలో నేను వుంటున్న ఇల్లు, నాకు ఇవ్వగలనని ఆవిడ నాకు మాటయిచ్చారు. కాని 1909తర వాత క్షేమం, కాశీ వెళ్లలేదు; గృహప్రవేశ మహోత్సవంజరగలేదు,

మునపటికంటె, ఇప్పుడు మా కుటుంబం పెద్దదయింది. నా లైబ్రరీ విపరీతంగా పెరిగిపోయింది. అసలే 'ఇమ్ము' లేని ఇంట్లో, మాకు మరీ ఉక్కిరిబిక్కిరిగా వుంది. ఇక కొద్దిరోజులకు పోతారనగా, మహారాణివారికి ఈ విషయం జ్ఞాపకంచేశాను. తమ సోదరుని జ్ఞాపకార్థం ఈఇల్లు నాకీయవలసినదని అడిగాను, లేదా దీనిని నాకు అమ్మడానికి ధర్మకర్తకు అనుమతి ఇమ్మన్నాను. ఆవిడ ఎటూ తేల్చి చెప్పలేదు. 'చూద్దాంలెండి' అన్నారు. దివంగతులరాలైన మహారాణీ మహారాజకుమారికా వారు నాకు చేసిన వాగ్దానాన్ని, మిత్రులవల్ల రాణిసాహెబు వారు విన్నారు; విని నాతో 'అవును. ఆఇల్లు మీ కీయవలసిందే' అన్నారు. నాటినుంచి నేనా విషయాన్ని ప్రస్తావించలేదు. ఎప్పుడో మహారాణి మహారాజ కుమారికా నాకు చేసిన వాగ్దానాన్ని పురస్కరించుకుని ఆవిడను నే నెన్నడూ నొక్కినొక్కి అడగలేదు. ఇపుడు మహారాణి సాహెబావారిని ఆమాట చెల్లించమని నేను అడగదలుచుకోలేదు, నాకూ వారికీ వుండే అనుబంధం ఒక వ్యాపారంవంటిది కాకూడదు

నేను సంస్థాన వారసత్వపు దావాలో పనిచేసినందుకు ప్రతిఫలంగా కొంతడబ్బును మంజూరు చేయడానికి మీరు అంగీకరించినట్లు, 'లా' బ్రాంచి సూపరెండెంటు నాతో చెప్పారు. కాని ఆ సొమ్ము ఎంతో యింకా నిర్ణయించలేదన్నారు. నాకు యివ్వబోయే ప్రతిఫలంలో కొంత మీరు ముందు యిచ్చినట్లయితే ఆడబ్బుతో నేను ఈ ఇల్లు కొనుక్కుంటాను. ఈ రోజుల్లో ఇది పదిహేనువందలకు పైన వుంటుంది; రెండువేలకు మించదు'

ఈ ప్రతిపాదన మీకు నచ్చినట్లయితే, ఇల్లు నాకు అమ్మే ఏర్పాటులు చేయవలసినదిగా మిమ్మల్ని కోరుతున్నాను.

ముందుగా మీ అభిమతాన్ని నాకు తెలియచేస్తే సంతోషం. ఈ లోపున నా స్వంత ఖర్చులతో ఇంటిని బాగుచేయించుకుంటాను. చాలాకాలం ఉద్యోగం చేసినా, నేను ఏమీ వెనక వేసుకోలేదు. అందువల్ల మీ తోడ్పాటు లేనిదే, ఇల్లు కొనేస్థితిలో లేను.

• • •

ఉదకమండలం
29 మే 1914

ప్రియమైన శ్రీ వేలస్,

* మా ఇంటిహాలు నిర్మాణం నేననుకున్న పద్ధతి ప్రకారం ఆరంభమయిందని కంట్రాక్టరు శ్రీ కె. అప్పన్నదొర తెలియ పరిచాడు. సంస్థానంవారు, కోటలోని పాతభవనాల స్తంభాలను దూలాలను అమ్ముతామన్నారు. అమ్మితే ఎన్ని అమ్ముతారో తెలిస్తే మిగిలినవి మార్కెట్టులో కొంటానని అప్పన్నదొర అంటున్నాడు. కనక మీరావిషయం నాకు తెలియచేయవలసిందిగా కోరుతున్నాను. శ్రీ ఫౌలరును, దూలాలు కావాలని అడిగాను. ఆయన మీతో మాట్లాడినట్లు చెప్పారు. అవి అమ్మడానికి అవకాశం లేకపోతే, కావలసిన కలప మార్కెట్టులో కొనమని కంట్రాక్టరుకి చెబుతాను.

ఇక్కడి వాతావరణం ప్రశాంతంగా వుంది. ప్రస్తుతం పనిలో వున్నాను. అది అయేసరికి వారంరోజులు పడుతుంది.

---

* ఇది అప్పారావుగారు స్వంతముగా కట్టుకున్న ఇల్లు. ఈ ఇంటి నిర్మాణమునకు హాలు, ప్రాతిపదిక. అది ఆయన లైబ్రరీ హాలు. పాత ఇంటిని ఆనుకునివున్న ఈకొత్త ఇంటికి వీధి వసారాలో ఇరువైపుల రెండు గదులు, మధ్య ఒకపెద్ద హాలు అవతల వసారా. గృహప్రవేశానంతరం కొన్ని మాసములు మాత్రమే వారు ఇందులో వున్నారు.

# చివరిరోజులు

కోట, విజయనగరం
7 ఏప్రియల్ 1915

ప్రియమైన శ్రీ ఎల్లింగ్టన్, *

మా ఆంతరంగిక కార్యదర్శి, శ్రీ గురజాడ అప్పారావు గారు కొన్ని నెలలనుంచి అనారోగ్యముతో బాధపడుతున్నారు. ఆయన యిప్పుడే విశాఖపట్నం బయలుదేరారు. ఇక్కడకంటె అక్కడ వాతావరణం బాగుంటుందని, తగిన వైద్యసహాయం లభిస్తుందని, వారి ఆశ. వారు శ్రీ పి. టి. శ్రీనివాసఅయ్యంగారింట దిగుతారు. మీరు వెంటనే అక్కడ కొకమారు వెళ్ళి వారి శరీరస్థితి జాగ్రత్తగా పరీక్షించి, కావలసిన అవుషధములు వాడుతూ, కంటికి రెప్పవలె కాపాడతారని నమ్ముతున్నాను. ఆయన ఆరోగ్యము ఎలా వుంటున్నదీ ఎప్పటికపుడు నాకు తెలియచేస్తూ 'బిల్లు' నాకు పంపండి. బిల్లు ఎంతయినా సరే, నేను మీకు చెల్లిస్తాను.

• • •

---

* మహారాణీ లలితాకుమారిదేవి, విశాఖపట్నం పెద్దాసుపత్రిలో జిల్లా సర్జనుగా వున్న ఎల్లింగ్టన్ దొరకు వ్రాసిన లేఖ. మహాకవి, విశాఖపట్నంలో కొన్నిరోజులే వుండి, ఇంటికి తిరిగివచ్చారు. విజయనగరం పెద్దాసుపత్రిలో డాక్టరుగా వుంటున్న, వారిమిత్రులు శ్రీ చాపా మంగయ్యనాయుడుగారి వద్ద మందు పుచ్చుకొంటున్నారు. కాని, జబ్బు నిమ్మళించడంలేదు. రానురాను ఎక్కువౌతున్నది. ఇక స్వయముగా తాను మద్రాసు వెళ్ళలేక, తగు సూచనలిమ్మని, తన శరీరపరిస్థితిని తెలుపుతూ సర్జనుకొక నివేదికను పంపారు. చూ; మహాకవి డైరీలు : పుట 253.

8 నాపీరురోడ్డు, పూనా
6 ఏప్రియల్ 1915

అయ్యా *

మా వస్తువులను గురించి పత్రికలలో ప్రకటించేటపుడు తమ పేరును, తాము యిచ్చిన యోగ్యతా పత్రమును వినియోగించుకోవచ్చునని అనుమతించినందుకు, మీకు మా ధన్యవాదములు. మీ దయకు మేము మిక్కిలి కృతజ్ఞులము.

• • •

విజయనగరం
2 జూన్ 1915

ప్రియమైన అప్పారావుగారూ, •

మీ ఉత్తరం చదువుతున్నపుడు, నాకెంతో దుఃఖం వచ్చింది. మనం కొన్నింటిని అర్థం చేసుకోలేము. కష్టాలు మంచి వాళ్ళకే వస్తాయి. వాళ్ళనే అందరూ బాధ పెడతారు. చెడ్డ వాళ్ళు ముందుకు వస్తూవుంటారు. వాళ్ళే బాగుపడతారు. వాళ్ళకు ప్రాపకం ఎక్కువ. లోకంలో ఇలా ఎందుకు జరుగుతూ వుంటుందో ఎవరికీ అర్థంకాదు.

ఇప్పుడు మీరు పడుతున్న ఆవేదన ఎందుకో నాకు తెలుసును. ఇన్నాళ్లూ ఇన్నేళ్లూ నిరంతరం మీరు కావించిన కృషి తప్పక ఫలిస్తుంది. ఏ చరిత్రకోసం, మీరు మీకాలాన్నీ శక్తినీ ధారపోశారో, ఆ చరిత్రను మీరే రచిస్తారు. తప్పదు. మీకు

* పెస్టన్జీ పి. పోచా అండ్ సన్సువారు, మహాకవికి వ్రాసిన ఉత్తరం

• ఇదిన్నీ, దీని తరవాత జాబున్నూ, ఫౌంళరుదొర వ్రాసినవి.

నిమ్మళిస్తుంది. నిమ్మళించాక, అది పూర్తిచేయవచ్చును. దిగులు పడవద్దు. మీ కొకరు ధైర్యము చెప్పనక్కరలేదు. మీ మనో ధైర్యం చాలా గొప్పది:

మీరు ఆత్మజ్ఞాన సంపన్నులు. మానవుల కెరుకపడని అంతిమ యాత్రాస్థలానికి బయలుదేరవలసి వస్తుందని మీరు భీతిల్లరు. చిరునవ్వుతో మృత్యువును పలకరించి, చిత్తస్థయిర్యముతో పయనిస్తారు. మరణమును ఆనందముతో ఆలింగనము చేసుకోగలిగిన ఆత్మ పరిపక్వమును పొందిన సిద్ధులు. అట్టి ఆత్మ పరిపక్వమును జీవితమున సాధించడానికే, మీరు జీవించారు. నాకున్నూ అలాంటి ధృతి ఆత్మ విభూతికలగాలని నాఅభిలాష.

మీరు జీవన్ముక్తులు, ఇక్కడనుంచి మీరు వెళ్ళిపోతున్నందుకు మీకు దిగులులేదు: ఇక్కడ మీరు వదలివెడుతున్నవాటిమీద, మీదిగులు. మీకుమారునకు, కుటుంబానికి ఏలోటూలేదు; ఇకమీ పెంపకపు కొడుకు, ఆచరిత్రమీదనేకదా. మీకున్న బెంగల్లాను! బెంగపడకండి. మీరు తలపెట్టిన చరిత్రను తగిన సమర్థులను నియమంచి, మీరు వుంటే ఎంత బాగుండునో, అంతబాగా వారిచేత వ్రాయించి, నేను పూర్తి చేయిస్తాను. అవును; ఇంతకంటే నేను మీకేవిధంగా సాయపడగలను !

ఈ ప్రాంతీయులలో, నేను మన్ననచేసే బహుకొద్దిమందిలో మీరు ముఖ్యులు. ఇంకొకరయితే, నేనింత బాధపడను. మీఆశయాన్ని నేను నెరవేరుస్తాను. కాని మీమీద నాకింకా ఆశ పోలేదు. *చరిత్రను మీరే పూర్తిచేస్తారని నా ఆశ!

---

* ఇక తానాట్టేకాలం జీవించనని మహాకవి తెలుసుకున్నారు. ఇంతకాలమై తాను పరిశోధించిన శాసనాలను, శ్రమపడి సేకరించిన రికార్డులను, వ్రాసిన భోగట్టాను ఆధారముగా చేసికొని, తగిన పండితుల

విజయనగరం
22 జూలై 1915

ప్రియమైన అప్పారావుగారూ

మీరు దయతో పంపిన పళ్ళు అందాయి. కృతజ్ఞుణ్ణి. మీ ఒంట్లో నింపాదిగా వున్నందుకు ఆనందిస్తున్నాను. చిరకాలం నుంచి మిమ్మల్ని వేధిస్తున్న జబ్బు తిరుగుమొహం పట్టింది. చిట్ట చివరికి మీరు జయించారు. మీరు తలపెట్టిన సాహిత్యకృషి ఫలిస్తుంది. మీరు అందుకోదలచిన ఆదర్శాలు మీరు అందుకుంటారు. మీకలలు నిజమౌతాయి. అది నిజమయ్యేవరకు మీరు జీవిస్తారు.

చరిత్ర రచనకు కావలసిన పరికరాలను సమకూర్చుకుంటున్నారా? మీపని నిర్విఘ్నంగా కొనసాగుతున్నదని నమ్ముతున్నాను. ఇంక ఫరవాలేదు. మీరు మళ్ళీ మాతో మాలాగే హాయిగా మసులుతూ వుంటారు.

♦ ♦ ♦

ట్రిప్లికేన్

ప్రియమైన అప్పారావుగారూ, * 6 సెప్టెంబరు 1915

మీరు రెండవ తేదీన వ్రాసిన జాబు అందింది. పుటలసంఖ్య

---

చేత తాను తలపెట్టిన కళింగదేశ చరిత్రను వ్రాయించి పూర్తిచేయించవలసినదని, మహాకవి, ఫౌలరుదొరను కోరారు: "ఆయన మిత్రుడు శ్రీ గిడుగు రామమూర్తి పంతులు దీనిని సమకూర్చడానికి ప్రయత్నించాడు. గాని ఆయనకు అవకాశం చిక్కినట్లు కనిపించదు. పూసపాటి గజపతుల చరిత్రగాని, విశాఖజిల్లా చాళుక్యుల చరిత్రగాని, చిట్టచివరకు ఆయన వ్రాయలేదు -"

కీ. శే. కిళాంబి రంగాచార్యులుగారు ఎం. ఏ. బి. యల్.

* గుమ్మడూరి వేంకటరంగారావుగారు వ్రాసిన లేఖ.

చాలకపోవడంవల్ల ఇంటర్మీడియటు సెలక్షన్లలో అనుకున్న కొన్ని మంచిభాగాలు చేర్చలేకపోయాము. కవిత్రయము భారత భాగములు, నన్నెచోడ, రంగనాధ, భాస్కర, కేతన (దశకుమార చరితము) కావ్యాలనుంచి కొన్ని భాగాలు సెలక్షన్లలో వున్నవి. ఇవికాక శ్రీనాథ, పోతన, పిల్లలమఱ్ఱి, కృష్ణరాయ, పెద్దన, రామరాజభూషణుల కావ్యభాగములను కొన్ని వేయాలను కుంటున్నాను. బి. ఏ. సెలక్షన్లకు కావలసినంత స్థలంవుంది. కనక ఇందులో చేర్చని భాగాలు అందులో చేర్చవచ్చునని అను కుంటున్నాను. 1917 మెట్రిక్యులేషన్ పరీక్షకు వేసిన వచన భాగాలను మీకీవేళ పోస్టు చేశాను.

తెలుగు నిఘంటు నిర్మాణ ప్రయత్నాలు ఒకదారికి వచ్చాయి. అక్టోబరు ప్రారంభములో పని మొదలవుతుంది. సంపాదక మండలి నిర్దేశించిన సూత్రములను అనుసరించి, నెలకు 225-250 రూపాయల జీతంమీద ప్రధాన సంపాదకులుగా తాము పనిచేయడానికి శ్రీ వేదం వేంకటరాయశాస్త్రిగా రంగీకరించారు. ప్రస్తుతం ఆయనకి సహాయపడడంకోసం ఇద్దరు పండితులను నియమించవలె నను కున్నాము. సంపాదకమండలి సమావేశం త్వరలో జరుగుతుంది. మీరు 1916 వ సంవత్సరానికి విశ్వవిద్యాలయ పరీక్షాధికారులుగా నియమితులైనారు. మీ ఆరోగ్యము బాగా వున్నదనుకుంటాను.

* * *

విజయనగరం

6 అక్టోబరు 1915

ప్రియమైన అప్పారావుగారూ *

మీ కుమారునిచేత పంపించిన మీ రెండు ఉత్తరాలు అందాయి. మీరింకా కోలుకోనందుకు విచారంగా వుంది. ఇపుడపుడే జబ్బు నయంకాదని, మీరు వ్రాసిన వాక్యాలు చదివి మిక్కిలి బాధపడ్డాను. మీతో ఒకసారి మాట్లాడాలని వుంది. శనివారం ఉదయం ఏడున్నర గంటలకు మీ యింటికి వస్తాను. అపుడు అన్ని సంగతులు, ముచ్చటించుకుందాము.

ఒగ్గిపురం వ్యవహారం తీర్మానం చేయాలని రెండు నెలల క్రితం అక్కడకు వెళ్ళాను. ఊళ్లో మీ పొలాలు చూశాను. రైతులు శిస్తులు యివ్వకుండా, మిమ్మల్ని యిబ్బంది పెడుతున్నట్లు అక్కడ విన్నాను. సరే ఇపుడే శ్రీ జగన్నాధరావు గారికి కబురుపెట్టి, మీకు రావలసిన వెయ్యి రూపాయలు పంపించే ఏర్పాటు చేయిస్తాను.

కృష్ణసాగరం వద్దనున్న మీ పొలం మాకవసరంలేదు. ఒకవేళ అవసరం పడితే, చాలా తక్కువభాగం కావలసివుంటుంది. ఏ సంగతీ మీకు తరవాత తెలియచేస్తాను. అగ్రహారకులు మిమ్మల్ని చిక్కులు పెడుతున్నారుకదా; మరి నేనెలాగ సాయపడగలను? ఆ చిక్కులు పోడానికి చేతనైనంతా చేస్తాను ఏ విధంగా తోడ్పడగలనో సూచించండి. జాబు వ్రాసి మీ అబ్బాయికిచ్చి పంపించండి.

---

* పౌలరుదొర వ్రాసిన లేఖ.

బెంగుళూరు
4 నవంబరు 1915

ప్రియమైన అప్పారావుగారూ *

మీరు 3 వ తేదీన దయతో వ్రాసిన లేఖకు ఇంత ఆలస్యంగా సమాధాన మిస్తున్నందుకు నన్ను క్షమించకోరుతున్నాను. సదా, మీరు కాంక్షించే ఉద్యమంకోసం మీరు కావించిన కృషివివరాలను అమితఆసక్తితో తెలుసుకుని ఆనందించాను. ఇదివరకు మీరు కమిటీ సమావేశ సారాంశాన్ని సంక్షిప్తంగా ఎరుకపరుస్తూ నాకొక లేఖ వ్రాశారు. ఇపుడు దానినిగురించే మీరు మీ లేఖలో ప్రస్తావించారనుకొంటాను.

మీ ప్రస్తుత మెమోరాండము నిర్దుష్టమైనది. పటిష్టమైనది. నిష్పక్షపాతబుద్ధితో పరిశీలించినవారు దానితో ఏకీభవింపక తప్పదు. కాని వెంకటరంగారావు, సబబుకు కట్టుబడి, శాస్త్రీయ దృక్పథంతో ఒడబడతాడని నేననుకోను.

మీ శేటుయిసు నాకు ఎన్ని ప్రతులు కావాలంటే అన్నీ పంపిస్తామన్నందుకు మీకు కృతజ్ఞుణ్ణి. ఇప్పటి మటుకు ఒక డజను ప్రతులు చాలును. అవసరం పడితే ఆనక మిమ్మల్ని ఎలాగా వేదిస్తానుకద !

రామమూర్తి, తాము పరీక్షకులుగా నియమితులైనట్లు చెప్పారు ! అద్భుతం, మహాసంతోషం. ఎదురు వాదించ వీలు లేని తమ థీసిస్ ప్రత్యక్షరం నిజమని ఋజువు చేసేటందుకు రామమూర్తి, ప్రాచీన గ్రంథాలనుంచి అనేక ఉదాహరణలను సేకరించారు. త్వరలోనే కళాశాలల పండితులను కలుసుకుందుకు ఆయన సంకల్పించుకున్నారట ! ప్రస్తుతం వ్యావహారిక

---

* జె. యే. ఏట్సు వ్రాసిన లేఖ.

భాషా ఉద్యమం కొంత వెనకబడితే వెనకబడుగాక. మీరూ ఆయనా కావిస్తున్న అమోఘమైన ఈ కృషిని, ఈనాడు కాకుంటే, రేపయినా అందరూ హర్షించి శిరోధార్యమని ఆమోదింపక తప్పదు!

నిరంతరం శ్రమపడడంవల్ల మీ ఆరోగ్యం క్షీణించింది. జబ్బులో మంచాన పడ్డందుకు దుఃఖంవస్తోంది అతిశీఘ్రంగా కోలుకుని మీరు ఆశిస్తున్నట్లు మీ ఆయుధాన్ని మళ్ళీ మీరు చేతబుచ్చుకుంటారు. మీ ఆరోగ్యం ఎలావున్నదో ఎప్పటికప్పుడు దయవుంచి నాకు తెలుపుతూవుండండి. మీ కృషి అనన్య సామాన్యమైనది.



# మహాకవి నిర్యాణం

విరిగి పెరిగితి ; పెరిగి విరిగితి
కష్టసుఖముల పారమెరిగితి
పండునన్నవి ఆశలెన్నో
మెండిరాలగ బొగిలితిన్.

చూతునా ! అని చూసితిని; మరి
చేతునా ! అని చేసితిని : ఇక
చూడ చేయగరాని వింతలు
చూపి కన్నులు కట్టితిన్.

శత్రుమిత్రుల కిచ్చి నెనరులు
స్నేహవార్ధిని కొల్లగొంటిని ;
నాటి మిత్రులు తరల శూన్యం
బైన పుడమిని నిలిచితిన్.

పంజరంబున నున్న కట్లను
పగలదన్నగ లేక స్రుక్కితి
నింగిపర్వగ లేని జన్మము
నీరసంబని రోసితిన్.

నవంబరు నెల. ఇరవై తొమ్మిది రాత్రుళ్ళు గడిచి పోయాయి, తెల్లవారింది. మహాకవి జీవితంలో అదే తుది వుదయమని ఎవరూ కలలోకూడా అనుకోలేదు.

మేడమీద గదిలో మంచంమీద మహాకవి మామూలు గానే దుస్తులన్నీ ధరించి పడుకున్నారు. మంచంప్రక్క కొడుకూ, ఎదుట డాక్టరు మంగయ్యానాయుడుగారూ దిగులుగా నించున్నారు. మహాకవి తల్లీ పిల్లలూ బంధువులూ ఆందోళనతో అటూ ఇటూ తిరుగుతున్నారు.

బయటకిటికీలోంచి ఎండపొడ గదిలో పడుతున్నది. చలిగాలి రొప్పుకొస్తున్నది. రొజ్జగాలీ ఎండపొడా మహాకవికి పడవు కదా!

దగ్గర నిలబడినవారిని మెల్లగా దరికిపిలిచి మహాకవి తాము ధరించిన దుస్తులన్నీ తీసివేయమన్నారు. వొక్క ఫ్లానలు లాల్చీని మాత్రం వుంచుకున్నారు.

తన మంచంప్రక్కనే దిగులుగా నించున్న కొడుకును చేరువకు రమ్మని పిలిచి "కొంచెం కోకోవైనూ, దంపిన తాంబూలమూ తెచ్చిపెట్టు బాబూ!" అన్నారు. అవి తండ్రి తీసుకుంటే ఏమవునో అనే భీతితో కొడుకు, డాక్టరు మంగయ్యనాయుడుగారిని చూపులతో ప్రశ్నించారు. డాక్టరుగారు ఇవ్వవచ్చునని తల ఊపారు. కొడుకు తండ్రికి వాటిని అందిచ్చాడు.

తాంబూలము చప్పరిస్తూ మహాకవి, డాక్టరుగారి చేయి పట్టుకుని "వీటిని వేసుకోవచ్చునో వేసుకోకూడదో నేను బతికుంటే ఆహారశాస్త్రంమీద వొక గ్రంథం రాస్తాను, డాక్టరుగారూ!" అంటూ చిరునవ్వు నవ్వారు.

అదే మహాకవి చివరి చిరునవ్వు. అదే ఆయన తుదిపలుకు అప్పటికి గోడనున్న గడియారం ఎనిమిది దాటి ఇరవయ్యో నిముషమువద్ద ఆగిపోయినది.

• • •

"ఉసురులకు విసికితివో ? యుద్ధము
కలదు; దేశముకొరకు పోరుము"
యుద్ధమా? ఇక నేమి లోకము!

చాలు ! చాలును ! లంగరెత్తుము !

# సూక్తులు : సుభాషితాలు

పుట్టుక వల్ల గొప్ప రానేరాదు. గుణయోగ్యతల వల ననే గొప్ప వచ్చును. పెద్ద యవస్థలోనుండు దుర్జనునికన్న తక్కువ స్థితిలోనుండు సజ్జనుడు నిజమైన గొప్పవాడు కాడా!

*　　*　　*　　*

చెడ్డతలంపు చెప్పిరాదు. ఎక్కణ్ణించో రానక్కర్లేదు, కంటికగ్కనపడకుండా మనసులో ప్రవేశించి పొంచివుంటుంది. చూసీ చూడనట్టు మనం వూరుకొని అది పైకొచ్చే ప్రయత్నాలు బాహాటంగా చేస్తూవుంటాం, ఆ అవకాశానికి అవకాశం యివ్వనివాడే ప్రాజ్ఞుడు.

*　　*　　*　　*

మనకు మనమే సత్యంపట్ల విధేయులమై వుండాలి' మనకు మన మనస్సే సాక్షి.

*　　*　　*　　*

నువ్వొక న్యాయానికి ధర్మానికి సామాజిక నియమానికి లోబడి వుండవలెనన్నపుడు, దానిని అనుసరిస్తున్న నీకూ వొక హక్కు వుంది. అది ఎంతవరకు ఆచరణయోగ్యమో దానిని

సూక్ష్మాతిసూక్ష్మంగా పరిశీలించే నీకు గల హక్కును ఎవరూ రద్దుచేయరాదు. అది దోషభూయిష్టమైనదని నువ్వు విశ్వసిస్తున్నపుడు, దానిని సంస్కరించే హక్కూ, అధికారమూ నీకు వుంది.

* * * *

నాది ప్రజల ఉద్యమము. దానిని యెవరిని సంతోషపెట్టడానికైనా వదులుకోలేను.

* * * *

రచయిత తాను ఏది వ్రాసినా, అది సబబైనదికానీ, కాకపోనీ, దానికేదో వొక సమర్థన వుందనే అనుకుంటాడు. దానితో నీకు నిమిత్తం లేదు.

* * * *

మానవుల అవస్థలను తెలుసుకోవాలంటే వారిలో మనం లీనమైపోవాలి. కవులు కలిసిపోవాలి. కవులకే విశేషాధికారం వుంది.

* * * *

సొగసులేని మనిషేవుండడు. స్నేహము, ప్రేమా అనేవి అనాది అయినప్పటికీ, యెప్పటికీ సరికొత్తగా వుండే రెండు వెలుగులను నరునిమీద తిప్పికాంచితే వింతవింతసొగసులుబయలు దేరుతవి. అసూయ అనే అంధకారంలో అంతా ఏక నలుపే!

* * * *

జీవితమూ సౌందర్యమూ అశాశ్వతమైనవని చెప్పే సిద్ధాంతాలు, ఇంద్రియ సుఖాలు పరిత్యజింపతగినవన్న వాదానికీ బలాన్నీయవు. దోషమన్నది అతిలోలత్వంలో యింద్రియ చాపల్యంలో యిమిడివుంది.

* * *

మానవుని ప్రేమించడమన్నది అతిసాధారణమైనవి జీవిత సూత్రం. ఇతరులను ప్రేమించడంవల్ల మానవునికి నిరవధి కానందం సిద్ధిస్తున్నది.

♦ ♦ ♦

మనం మూర్తీభవింప చేయవలసిన ప్రేమ విశ్వమానవ ప్రేమ. తోటి మానవుణ్ణి హృదయమిచ్చి ప్రేమించు.

♦ ♦ ♦

వినుము, ధనములు రెండు తెరగులు; ఒకటి మట్టిని పుట్టినది; వేరొకటి హృత్కమలంపు సౌరభము.

♦ ♦ ♦

ప్రేమ పెంచక పెరుగునే? ప్రేమ పెన్నిధి. గాని యింటను నేర్పరీకళ, ఒజ్జలెవ్వరులేరు,

♦ ♦ ♦

ప్రేమ నిచ్చిన ప్రేమ వచ్చును; ప్రేమ నిలిపిన ప్రేమ నిలుచును.

♦ ♦ ♦

ప్రేమ కలుగక బ్రతుకు చీకటి

♦ ♦ ♦

దేవుఁడెవడో దాగెనంటూ కొండకోనల వెతుకులాడే వేలా? కన్ను తెరిచిన కానబడడో? మనిషి మాత్రుడియందు లేడో?

♦ ♦ ♦

మతం వేరై తేను యేమోయి? మనసు లొకటై మనుషు లుంటే.

♦ ♦ ♦

అన్నదమ్ముల వలెను జాతులు మతములన్నీ మెలగ వలెనోయి.

♦ ♦ ♦

మునుమును మేటివారల మాటలనియెడి మంత్రమహిమను జాతిబంధములన్న గొలుసులు జారి సంపద లుబ్బెడున్.

♦ ♦ ♦

యెల్లలోకము వొక్కయిల్లై, వర్గభేదములెల్లకల్లై
వేలనెరుగని ప్రేమబంధము వేడికలుం కురియ
మతములన్నియు మాసిపోవును, జ్ఞానమొక్కటె నిలిచి వెలుగును;
అంత స్వర్గసుఖంబులన్నవి యవని విలసిల్లున్.

♦ ♦ ♦

మంచిచెడ్డలు మనుజులందున యెంచిచూడగ రెండె కులములు.

♦ ♦ ♦

దేశమున ప్రేమించుమన్నా,మంచిఅన్నదిపెంచుమన్నా.

♦ ♦ ♦

దేశాభిమానం నాకు కద్దని వొట్టిగొప్పలు చెప్పుకోకోయ్
పూని యేదైనాను వొక మేల్ కూర్చి జనులకు చూపవోయ్.

♦ ♦ ♦

వొట్టిమాటలు కట్టిపెట్టోయ్, గట్టిమేల్ తలపెట్టవోయ్

♦ ♦ ♦

స్వంతలాభం కొంతమానుకు పొరుగువాడికి తోడు పడవోయ్.

♦ ♦ ♦

ఒకరిమేల్ తనమేలనెంచే నేర్పరికి మేల్ కొల్లలోయ్.

♦ ♦ ♦

ఒరుల మేలుకు సంతసిస్తూ ఐకమత్యం నేర్చవోయ్.

♦ ♦ ♦

మందగించకముందు అడుగేయ్, వెనకపడితే వెనకే నోయి.

♦ ♦ ♦

దేశంమంటే మట్టికాదోయ్, దేశమంటే మనుజులోయి.

♦ ♦ ♦

చెట్టపటాల్ పట్టుకుని దేశసులంతా నడవవలెనోయ్.

♦ ♦ ♦

బ్రతికి, చచ్చియు, ప్రజకెవ్వడు ప్రీతిగూర్చునో, వాడె ధన్యుడు.

◆ ◆ ◆

దేశమనియెడి దొడ్డవృక్షం, ప్రేమలను పూలెత్తవలెనోయ్.

◆ ◆ ◆

ఆకులందున అణగి మణగీ, కవితకోవిల పలకవలెనోయి. పలుకులను విని దేశమందభిమానములు మొలకలెత్తవలెనోయి.

◆ ◆ ◆



